


  

శ్రీభద్రాచలం. | తూ. గోదావరి.

अपौरुषेय अमूल्य
अमुद्रित
शास्त्रोद्धरणम्.

గ్రంథమాలాశాఖ, ప్రథమప్రచురణము.



సంహితాగుచ్ఛము, ప్రథమపుష్పము.

The Publication
of
Literary Pride
of India.

# శ్రీ కపింజల సంహిత

ముఖ్యసంపాదకుడు:

పాడిచేటి సీతారామానుజాచార్యులు

సహాయసంపాదకుడు:

గో. చిన శ్రీనివాసాచార్యులు

భద్రాచలం.

అత్యుత్తమప్రతి సభ్యులకు రు 2, ఇతరులకు రు 4 } పోస్టేజీ ప్రత్యేకము.
సాధారణప్రతి ,, రు 1-8, ,, రు 3






# పాంచరాత్రాగమ అధికతా.

శ్లో॥ ఇదం శతసహస్రాద్ధి - భారతాఖ్యానవిస్తరాత్
ఆవిధ్యమతిమంథానం - దధ్నోఘృతమివోద్ధృతం
నవనీతం యథాదధ్నో - ద్విపదాం బ్రాహ్మణో యథా
ఆరణ్యకంచ వేదేభ్యః - ఓషధీభ్యో యథామృతం
ఇదంమహోపనిషదం - చతుర్వేద సమన్వితం
సాంఖ్యయోగకృతాంతేన - పాంచరాత్రానుశబ్దితం
నారాయణముఖోద్గీతం - నారదోశ్రావయన్మునీన్
బ్రహ్మణస్సదనేతాత - యథాదృష్టం యథాశ్రుతం
ఇదం శ్రేయ మిదం బ్రహ్మ - మిదం హిత మనుత్తమం
ఋగ్యజుస్సామభిర్జుష్ట - మథర్వాంగిరసైస్తథా
భవిష్యతి ప్రమాణంవై - ఏతదేవానుశాసనం
ఏతద్ధిసర్వశాస్త్రాణాం - శాస్త్రముత్తమసంశ్రితం
పంచరాత్రమితిఖ్యాతం - నారాయణముఖోద్గతం
తస్మాత్ప్రవక్ష్యతేధర్మాన్ - మనుస్స్వాయంభువస్స్వయం
అన్యేషాం ధర్మశాస్త్రాణాం - ఏతద్యోని ర్భవిష్యతి॥

— శ్రీమహాభారతే॥



# గౌరవాధ్యక్షులు





ఈ సంస్థయం దత్యంతాభిమానముతో గౌరవాధ్యక్షపదవి నంగీకరించి, యిమ్మహోద్యమనిర్వాహణమునం దేపాటి లోటును వాటిల్లనీక, తమసర్వస్వమును సంస్థయభి వృద్ధికొరకే వినియోగింప బద్ధకంకణులైయున్న,

శ్రీ శ్రీ శ్రీ

## శ్రీ పర్చా రామనాథరావు జమీందారు

(కారేపల్లి - నైజాం) వారిని

శ్రీ రామచంద్రమూర్తి సర్వదా సర్వాభీష్టములను ప్రసాదించుచు, రక్షించునుగాక యని వేడుచున్నారము.



(ఈమహాపురుషు లిదివరలో, శ్రీరామయజ్ఞ, భాగవతసప్తాహ, రామాయణ సప్తాహ, షష్ఠివర్ష పట్టాభిషేక, సామ్రాజ్యపట్టాభిషేకాది యుత్కృష్ట కార్యముల ననేకమాచరించి, పరమభాగవతశిఖామణులుగా, దేశీయుల కెల్ల శుప్రితపరిచయులయ్యే యున్నారు. అదృష్టవశాత్తుగా, నిమ్మహామహుల యభిమానాదరణములకు పాత్రమగుట, నీసంస్థయును త్వరలోనే మహాభివృద్ధినొందగలదని మిక్కిలి యాసింపుచున్నారము.)

—సంపాదకుడు.



# శ్రీపాంచరాత్రాగమశాస్త్రసర్వస్వము,

# నిబంధనలు.

## ఉద్దేశ్యము - OBJECT.



భారతదేశాభివృద్ధికిన్ని, జాతీయౌన్నత్యతకున్ను మూలభూతమై - వేదమువలె నపౌరుషేయమై, స్వతఃప్రమాణమై, పరబ్రహ్మస్వరూపుండగు శ్రీమన్నారాయణునిచే లోకహితార్థముగా, మోక్షోపాయప్రదర్శనంబుగా, అనంతగరుడవిష్వక్సేనబ్రహ్మేంద్రులకు మొదట నైదురాత్రింబులలో నుపదేశింపబడి - పిమ్మట ననేకమహర్షులచే ననేక సంహితలుగా (అనుష్టుపు శ్లోకరూపమున) విరచింపబడి - శ్రీపాంచరాత్రాగమతంత్రము, ఏకాయనాఖ్యశ్రుతి, సాత్త్వతవిధి, భగవచ్ఛాస్త్రము మున్నగునామాంతరములచే (సార్ధకోటిప్రమాణముగా) జగత్ప్రసిద్ధినొంది - ఋగ్యజుస్సామాథర్వణాదిభేదంబులతో నొప్పెడి వేదమువలెనే, దివ్యసిద్ధాంత (మంత్రసిద్ధాంత), ఆగమసిద్ధాంత, తంత్రసిద్ధాంత, తంత్రాంతరసిద్ధాంతంబు లను నాలుగుభేదంబుల నలరారుచు - ఇట్టి ప్రతిభాగమునకును సంబంధించిన మూల గ్రంధము (సంహిత)యందున్న, జ్ఞాన, యోగ, క్రియా, చర్యా, పాదరూపమున వేదాంత, యోగ, ధర్మ, పాక, శిల్ప, జ్యోతిషాది ముఖ్యశాస్త్రములతో సంబంధించిన అనేకయుక్తిప్రత్యక్షవిషయములతో

నిండియుండి - ఇంకను, విష్ణ్వారాధన విధాన, ఆలయనిర్మాణ, ప్రతిష్ఠాకరణ, ఉత్సవవిశేష, యంత్రోద్ధరణ, మంత్రపురశ్చరణ, ప్రాయశ్చిత్త, శాంతికర్మ, కామ్యక్రియ లచే నొప్పుచు స్మృతీతిహాసపురాణాదులయం దత్యంతము కొనియాడబడి - భారత వర్షమునందుగల జనసంఖ్యలో మూడవవంతు గల శ్రీవిశిష్టాద్వైత మతస్థులకు ముఖ్యాధారమై-అనేక ప్రాచీనవిద్వత్పుంగవుల (రామానుజ, యామున, దేశిక, వైదికసార్వభౌమాదుల)చే మహత్తరముగా విమర్శింపబడి - అనేకధర్మశాస్త్రగ్రంధరచయితల కాధారమై - అనేక మహాక్షేత్రములయం దతిచిరకాలానుగతముగా నాచరణీయమై - అనేకవిధములుగా విదేశీయుల మన్ననలకుగూడ పాత్రమై - మానవ జీవితరహస్యముల నెల్ల దెలుపజాలిన వేదసారమై - మనపూర్వీకు లెట్టి యసమయములందును తమ ప్రాణములకన్న మిన్నగా సంరక్షించి మన కొసంగిన, వారల విజ్ఞాననిధియగు - శ్రీపాంచరాత్రాగమశాస్త్రము.

నేటికాలవైపరీత్యతచే నానాటికిని యంతరించుచు - ప్రతి పల్లెయందున్ను, పూరింటి యటకలపై పాతవెదురుపేళ్ళబుట్టలలో (దుబ్బ దులుపు దిక్కెనను లేక) పడియుండి, క్రిమికీటకాదుల కాహారముగా మారుచు - క్రిమక్రమముగా మనదృక్పథము నుండి మాటుబడి, చూచుచుండగనే విస్మృతవాఙ్మయమున చేరిపోవుచున్నందున - ఇది దేశమున కొక గొప్పతీరని లోటుగా భావించి - ఇందుకుసంబంధించినమూలగ్రంధములు (సంహితలు) విమర్శనగ్రంధములు, ప్రయోగగ్రంధములు, నిర్ణయగ్రంధములు, వ్యాఖ్యానములు, దీపికలు, భాష్యములు మున్నగు సన్నితరగతులకు జెందిన గ్రంధరాజములను (షుమారు 1500 అముద్రితగ్రంధములు) హతశేషమైనవానినైనా యొక్కచో జేర్చిపెట్టి సంరక్షించుచు, పరిశోధకు లిట్టి గ్రంధసంపాదనమునకై ప్రస్తుతము పొందుచున్న దుర్భర కష్టనష్టముల దొలగించుటకున్ను ఇందు ముఖ్యములగు - గ్రంధములను, యొకదానిపిదప వేరొక్కటిగా, సర్వజనోపయోగకరముగాను, సర్వాంగసుందరముగాను, ప్రకటించి, యెల్లవారలకును యీముఖ్యశాస్త్రమును కరతలామలకమై మొనరించి, జగత్కల్యాణసాధానమునకై

యథాశక్తియత్నించుటకున్ను - ఇంకను, ఇట్టియుత్తమశాస్త్రమును సాంగోపాంగముగా సాంప్రదాయజ్ఞు లగువారిచేత ప్రత్యేకముగా విద్యార్థులకు బోధింపజేయుటకున్ను - విద్వాంసులగువారిచే నీవిషయము నామూలాగ్రముగా చర్చింపించి, యద్దానిప్రాముఖ్యతను జనసామాన్యమున వెల్లడించి, తద్వారా లోకమంతయున్ను యిందుగల మహల్లాభమును పొందునట్లొనరింప జేయుటకున్ను - అన్నివిధములచేతను కృషిసలుపుటకై యీయుద్యమ మారంభింపబడినది.

---

## ఉపశాఖలు - BRANCHES.

ఈదిగువ నుదహరించిన శాఖలను స్థాపించుటచేత పైయుద్దేశము నిర్వహింపబడును.

1 గ్రంథనిలయము - Library.

(1) హతశేషములగు యీశాస్త్రగ్రంథముల నెల్ల యిందు చేర్చి సంరక్షించుచు పరిశోధకులకు సర్వసౌకర్యములున్ను కలుగ జేయబడును.

(2) నెలకొకపర్యాయము సభ్యులకు కావలసినవిషయము లుచితముగా పరిశోధింపబడి ప్రత్యుత్తరము లొసంగబడును.

న రా:- ఇప్పటికె బహువ్యయప్రయాసలకు లోబడి సుమారు 50 గ్రంథములను (ముద్రితాముద్రితములలో) అనేకభాషలయందు యిందు చేర్చబడినవి. మిగిలినవాటికొరకై విరివిగా ప్రయత్నములు జరుపబడుచున్నవి.

2 గ్రంథమాల - Bookseries.

(1) ప్రతినెలకున్ను 100 పుటలకు తక్కువగాకుండా యొకదానిపిమ్మట వేరొక్కటిగా అన్నిగ్రంథములును యిందు ప్రకటింపబడును.

(2) ప్రతిగ్రంథమున్ను - డెమ్మీసైజు, గ్లేజుకాగితము, మంచి అచ్చు, చిత్రపటములు, వివరణపత్రికలు, క్యాలికోబైండు, గిల్టుపేర్లను గలిగి సర్వాంగసుందరమై యుండును.

(3) ముఖ్యముగా తెలుగులిపిలోను అవసరమునుబట్టి తదితర లిపులయందున్న గ్రంథములు ముద్రింపబడును. వీలునుబట్టియు, అవసరమునుబట్టియు టీకాతాత్పర్యవిశేషార్థాదులు వ్రాయబడును.

(4) ఈగ్రంథములలో యొక్కలిపిలోనివిమాత్రము (సభ్యుల యిష్టానుసారముగా) యొక్కొక్కప్రతిచొప్పున సదుపాయముగా నొసగబడును. మిగిలినవి ఇతరులధరకే యొసంగబడును.

మరా:- ప్రథమగ్రంథముగా, 1931 వ సం॥ జనవరి ఫిబ్రవరి మార్చి నెలల లోకే సంపుటముగా జేర్చి "శ్రీకపింజలసంహిత" ముద్రింపబడినది. ద్వితీయగ్రంథముగా "శ్రీపురుషోత్తమసంహిత"ముద్రణమందు గలదు.

| | | | | |
|---|---|---|---|---|
| కపింజలసంహిత వెల, | ఆత్యుత్తమప్రతి చందాదారులకు రు | 2-0-0 | ఇతరులకు రు | 4-0-0 |
| | సామాన్యప్రతి | 1-8-0 | ,, | 3-0-0 |

3 ప్రత్యేకపాఠశాల - A Special School.

ఈశాస్త్రవిషయము లిందు సాంగోపాంగముగా సాంప్రదాయజ్ఞులగువారలచేత విద్యార్థులకు (అర్హతల ననుసరించి) యుచితముగ బోధింపబడును.

4 మాసపత్రిక - A monthly journal.

విద్వాంసులచే నామూలాగ్రముగా యీశాస్త్రవిషయములను చర్చింపించి జనసామాన్యమునకీశాస్త్రప్రాముఖ్యత వెల్లడిచేయబడును.

సభ్యుల కందరకును యీపత్రిక యుచితము.

మరా:- పైనుదహరించిన 3, 4 శాఖలు (పాఠశాల, పత్రికలు) రెండున్ను, యీ సంస్థకు (1000) వేయిమంది సభ్యులు (అన్నితరగతులయందున్న చేరిసమొత్తము) యేర్పడిన తత్క్షణమే ప్రారంభింపబడును.

## సభ్యత్వము - MEMBERSHIP.

ఈదిగువ నుదహరించిన 5 తరగతులయందున్న సభ్యులు చేర్చుకొనబడెదరు.

(1) ప్రధానపోషకులు - Chief Patrons.

(రు 116 లకు అధికము) నూటపదహారురూప్యముల కధికముగా దయచేయువారలు.

(వీరలఫోటో నొకమారు ప్రకటించుట. అన్నిగ్రంథములందున్ను వీరలపేర్లు ప్రకటించి యొక్కొక్కప్రతి శాశ్వతముగా యుచితముగా నొసంగుట )

(2) పోషకులు - Patrons.

(రు 116) నూటపదునారురూప్యముల దయచేయువారలు. (వీరలకును ప్రధానపోషకులకువలెనే గౌరవాధికారములు గలుగజేయబడును.)

(3) గౌరవసభ్యులు- Honorary members.

(116 లకు తక్కువ) నూటపదహారురూపాయలకుతక్కువయగు మొత్తముల నొసంగువారలు.

(వీరల సహాయమును వెంటనే ప్రకటించి సదరుగ్రంథమొకప్రతి యుచితముగా పంపబడును.)

(4) కార్యాలోచనాసభ్యులు - Working members.

సభ్యులను చేర్చుట, గ్రంథములను సంపాదించుట, సలహాల నొసంగుట మున్నగు విధములుగా సంస్థయొక్క అభివృద్ధికై తోడ్పడువారలు.

(వీరలు పనిచేయునంత కాలమున్ను యెప్పటిసహాయమునప్పుడు ప్రకటించుచు, అంతవర కన్నిగ్రంథములును యొక్కొక్క ప్రతి యుచితముగా నొసంగబడుచుండును.

(5) చందాదారులు - Subscribing members.

రు 10 లు ప్రవేశరుసుమును చెల్లించి, అన్నిగ్రంథములను సగము వెలకు కొనుచుండువారలు.

స్త్రీలకు, విద్యార్థులకు, విద్యాసంస్థలకు, యీరుసుము సగమువంతు తగ్గింపబడును. (రు 5 లు మాత్రమే)

నిరుపేదలుగా రుజువుచేయబడువారల కీరుసుము పూర్తిగా మాఫీచేయబడును.

(వీరల ప్రవేశమునుమాత్ర మొక్కపర్యాయము ప్రకటించి అన్నిగ్రంథములున్ను సగమువెలకే యిచ్చుచుండెదము)

(1) షరా:- ఈ ప్రవేశరుసుము రు 10 లున్ను యొకేమారు చెల్లింప నవకాశము లేనివారు—

దరఖాస్తుతో రు 2—0—0, ప్రథమ గ్రంథముతో 2–0–0, 6 నెలవాయిదాలలో 6–0–0, ఈవిధముగా మొత్తము 10–0–0లు చెల్లింపవచ్చును.

ఈవిధముగా పై మొత్తము లాయాగ్రంథముల వీ. పీ లలో చేర్చియే వసూలు చేయబడును. అనగా - మొదట రు 2-0-0 లు మాత్రం చెల్లించి పిమ్మట 8 మాసములదనుకను యితరులఖరీదుకే గ్రంథములను కొన్నవారలు తమప్రవేశరుసుమును పూర్తిగా వాయిదాలలో చెల్లించినవారగుదురు. అప్పటినుంచిన్ని ఇతరులకన్న సగముధరకే వీరలకు శాశ్వతముగా మాగ్రంథములు చేరుచుండగలవు.

(2) స్త్రీలు మున్నగువారలున్ను (ఈరుసుములను సగమువంతు మాత్రమే చెల్లించువారలున్ను) పైనుదహరించినవిధముగా వాయిదాలలో (సగముచొప్పుననే) రు ౫ లు చెల్లించ నవకాశము గలదు.

(3) మాచందాదారులకు యొక్కొక్కసంవత్సరం గ్రంథముల వెల (1200 పుటలకు తక్కువగానివి) పోస్టేజీగాక రు 12 0-0 లు అగును. కాని మొదటనే రు 10 లు మాత్రం మనియార్డరుచేసినచో మేమే ఖర్చులు భరించి సంవత్సరాంతముదనుకను అన్నిగ్రంథములను పంపెదము.

(4) ఎవ్వరైనను యేతరగతిలోనైనను 5 మందికి తక్కువగాని సభ్యులను చేర్చువారు, వారుసభ్యులైయుండునంతకాలమున్ను ఉచితముగా అట్టితరగతిలో సభ్యులుగా నుండగలరు. విశేషయగు సహాయమునను (ఏవిధముగానైనసరే) ప్రత్యేకగౌరవబహూకృతులతో సత్కరించుట కాగలదు.

నిబంధనలు

## ప్రార్థన — PRAYER.

దేశీయమహాజనులెల్లరును మానవసామాన్యధర్మనిర్వహణముగా యీపురాతనశాస్త్రము నుద్ధరింప యథాశక్తి దోడుపడి, దేశభాషాభగవద్భాగవతసేవలచే కృతకృత్యు లయ్యెదరుగాక !

ఇట్లు విన్నవించు,
భవద్విధేయుడు, జగన్మంగళసంధానాకాంక్షి,
షా. సీతారామానుజాచార్యులు,
సంపాదకుడు (Editor),
గో. శ్రీనివాసాచార్యులు,
సహాయసంపాదకుడు (Asst. Editor).

## వ్యవస్థాపకులు.

1 శ్రీమదిత్యాది శ్రీమాన్ గొట్టిపుళ్ళ సీతారామానుజాచార్యులుగారు (ప్లీడరు, డి. బో. మెంబరు, పెద్దఅర్చకులు) భద్రాచలం.

2 శ్రీ శ్రీమాన్ శ్రీవిద్వాన్ గొట్టిపుళ్ళ శ్రీనివాసాచార్యులుగారు (అర్చకులు, ఉభయ వేదాంతధర్మపారశాలాధిపతులు) భద్రాచలం.

3 శ్రీ శ్రీమాన్ గొట్టిపుళ్ళ పెద్దసీతారామానుజాచార్యులుగారు (అర్చకులు, ప్లీడరు) భద్రాచలం.

4 శ్రీ శ్రీమాన్ పొడిచేటి నరసింహాచార్యులుగారు (అర్చకసంఘాధ్యక్షులు) భద్రాచలం.

5 శ్రీ శ్రీమాన్ పొడిచేటి సీతారామానుజాచార్యులుగారు. Ex. ప్లీడరు-అర్చకులు, శ్రీరామదాసాశ్రమాధిపతులు) భద్రాచలం.

6 శ్రీ శ్రీమాన్ గొట్టిపుళ్ళ చిన్నశ్రీనివాసాచార్యులుగారు (అర్చకులు, భాగవతారు) భద్రాచలం.

P. S ఉత్తరప్రత్యుత్తరములు తెలుగు ఇంగ్లీషు సంస్కృతభాషలలో జిలుగులేకుండా వ్రాయవలయును. వివరములకు అణాబిళ్ళ పంపునది.

# శ్రీపాంచరాత్రాగమశాస్త్రసర్వస్వము,
# భద్రాచలం, తూర్పు గోదావరిజిల్లా.

# సభ్యులు.

---

## ప్రధానపోషకులు.

1 శ్రీ బ్రహ్మశ్రీ విశ్వదాత దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు (ఆంధ్రపత్రికాధిపతులు) మద్రాసు.

2 శ్రీ శ్రీమాన్ కోయిల్ కందాడై అణ్ణన్ శ్రీరంగాచార్యులు అయ్యవార్లంగారు (శ్రీముదలియాండాన్ వంశీకులు) కాంజీవరం.

3 మ॥ రా॥ శ్రీ పర్చా రామనాధరావు జమీందారుగారు (శ్రీభద్రాచలశ్రీసీతారామచంద్ర షష్టివర్షమహాసామ్రాజ్య పట్టాభిషేకోత్సవనిర్వాహకులు) కారేపల్లి, నైజాం.

4 మ॥ రా॥ శ్రీ అభినవరామదాసు గుంపు సోమిరెడ్డిగారు (పశ్చిమభద్రాద్రి) తాళ్ళ గోకులపాడు, కర్నూలుజిల్లా (శ్రీ భద్రాద్రిసీతారామచంద్రగర్భాలయగోపురసువర్ణకవచనిర్మాతలు, శ్రీ గోవిందమహాయోగి ప్రియశిష్యులు)

5 శ్రీమాన్ అకలంకం రంగభాష్యమయ్యంగారు (వారి తండ్రి కీ॥ శే॥ అకలంకం వెంకటనరసింహాచార్యులుగారిజ్ఞాపకార్థము) సంగంగుంట, గుంటూరు.

---

## మహారాజపోషకులు.

1 మ॥ రా॥ రా॥ శ్రీ మహాబూబు షర్ ప్రాజవంతు శ్రీరాజా పార్థసారధి అప్పారావు సవై అశ్వారావు బహద్దరు జమీందారువారు, భద్రాచలం, పాల్వంచ, నూజవీడు యస్టేట్లు వగయిరాగారి పౌత్రులగు శ్రీ కుమారరాజా విజయఅప్పారావు సవై అశ్వారావు బహద్దరు ధొరవారు, శనివారపేట, [illegible]

## —॰ పోషకులు ॰—

1 శ్రీ శ్రీ చీమకుర్తి బసవయ్యగారు (వైశ్యపత్రికాధిపతులు) గుంటూరు.

2 శ్రీ మాన్ దాచేపల్లి రామబ్రహ్మాచార్యులువారు (వైశ్యగురుకులాశ్రమ మేనేజర్లు) గుంటూరు.

3 శ్రీ శ్రీ కామరాజుగడ్డ రాజేశ్వరరావుగారు, గుంటూరు.

4 మ॥ రా॥ శ్రీ ఆత్మూరి రామమోహనరాయ్ గారు, చిత్రకారులు, బెజవాడ.

5 శ్రీ శ్రీ కర్లపాలెం కోదండరామయ్యగారు. (ఆంధ్రగ్రంథాలయప్రెస్ మేనేజరు) బెజవాడ.

6 మ॥ రా॥ శ్రీ పెండేల చక్రపాణి బ్రదర్సువారు, (కన్యకాప్రెస్ మేనేజరు) గుంటూరు.

7 మ॥ రా॥ శ్రీ శ్రీ ఆర్కాటు శ్రీనివాసరావు మొదల్యారు జమీందారుగారు, మంగపేట మొతా వగయిరా, షికిండ్రాబాదు, నైజాం.

8 శ్రీ శ్రీమాన్ శ్రీభద్రాచల శ్రీసీతారామచంద్రమహాప్రభువారి దివ్యసన్నిధి అర్చకస్వాములు.

1 శ్రీ శ్రీమాన్ పొడిచేటి నరసింహాచార్యులుగారు (అర్చక సంఘాధ్యక్షులు)

2 ,, పొడిచేటి చిన్నశాయన్నాచార్యులుగారు.

3 ,, పొ॥ రాఘవాచార్యులుగారు.

4 ,, పొ॥ రామానుజాచార్యులుగారు.

5 ,, పొ॥ సీతమ్మగారు.

6 ,, అమరవాది చిన్నకృష్ణమాచార్యులుగారు.

7 ,, అ॥ పెద్దశేషాచార్యులుగారు.

8 ,, అ॥ జగన్నాథాచార్యులుగారు.

9 ,, అ॥ పెద్దరామానుజాచార్యులుగారు.

10 ,, అ॥ చిన్నశేషాచార్యులుగారు.

11 శ్రీశ్రీమాన్ అమరవాది వెంకటరామానుజాచార్యులుగారు.
12 " అ॥ రంగశేషమ్మగారు.
13 " గొట్టుపుళ్ల సీతారామానుజాచార్యులుగారు, ప్లీడరు, డి. బో. మెంబరు.
14 " గొట్టు॥ పె సీతారామానుజాచార్యులుగారు, ప్లీడరు.
15 " గొ॥ చిన్న సీతారామానుజాచార్యులుగారు.
16 " గొ॥ శ్రీనివాసాచార్యులుగారు (విద్వాన్)
17 " గొ॥ చిన్న శ్రీనివాసాచార్యులుగారు (భాగవతార్)
18 " గొ॥ పెద్దకృష్ణమ్మగారు.
19 " కోటి రాఘవాచార్యులుగారు.
20 " కోటి సింహాద్రి అప్పలాచార్యులుగారు.
21 " మరింగంటి వెంకటనరసమ్మగారు.
22 " నలదీగె సీతారామానుజాచార్యులుగారు, పర్ణశాల.

## కార్యాలోచనా సభ్యులు.

1 శ్రీ శ్రీమాన్ విద్వాన్ అమరవాది, నారాయణాచార్యులుగారు, వరంగల్, గిర్మాజీపేట, నైజాం.
2 " నండూరు వెంకటఅప్పలాచార్యులుగారు, సింహాచలం.
3 " అకలంకం రంగభాష్యమయ్యంగారు, గుంటూరు.
4 " అమరవాది చిన్న శేషాచార్యులుగారు, భద్రాచలం.
5 " కళ్లకురిటి వెంకటరత్నమాచార్యులుగారు, సంగీతవిద్వాన్, ఆయుర్వేదవైద్యులు, కమ్మంమెట్టు, నైజాం.

6 శ్రీ శ్రీమాన్ పాడిచేటి నరసింహాచార్యులుగారు, భద్రాచలం.
7 ,, కొడవలగంటి వెంకటాచార్యులుగారు, కొత్త పట్టణం, గుంటూరుజిల్లా.
8 ,, ఆసూరి మోహన రంగాచార్యులుగారు, నేటివు డాక్టరు, బెజవాడ.
9 ,, డాక్టరు డి. రంగాచార్యులుగారు (శ్రీ వైఖానస పత్రికాధిపతులు) మద్రాసు.
10 ,, మరింగంటి సీతారామానుజాచార్యులు గారు, ఆయుర్వేదవైద్యులు, తల్లంపాడు, నైజాం.
11 ,, చలమచర్ల శోభనాద్ర్యాచార్యులుగారు, వుంగుటూరు, కృష్ణాజిల్లా.
12 ,, దిట్టకవి వేంకటనృసింహాచార్యులుగారు, తుళ్లూరు, మంగళగిరి పోస్టు.
13 ,, బి.యన్. రంగభట్టరువారు (శ్రీ కర్ణాటకరాష్ట్ర అర్చకమహాజన సంఘాధ్యక్షులు) బెంగుళూరు.
14 ,, రొంపిచర్ల భట్టరు శ్రీనివాసాచార్యులు గారు, (వైఖానస విద్యానిలయం) ఆకులమన్నాడు.
15 మ॥ రా॥ శ్రీ టి. వి. కుబేంద్రరాజుగారు, ఆర్టిస్టు, మద్రాసు.
16 శ్రీ శ్రీమాన్ వాడపల్లి జోగాచార్యులు గారు, పాలమూరు, నల్గొండజిల్లా.
17 ,, ములుగు వెంకటనృసింహాచార్యులుగారు (అంతర్వేది స్థానాచార్యులు) ఉంద్రాజవరం.
18 ,, పరాంకుశం శ్రీరామమూర్తిగారు, డి॥ ప్లీడరు, బరంపురం, గంజాంజిల్లా.
19 ,, ఆయుర్వేదవిద్వాన్ కామసముద్రం విద్వత్కవి కుంజరం వెంకటకృష్ణమాచార్యులుగారు, కంతాత్మకూరు, నైజాం.
20 మ॥ రా॥ శ్రీ పి. వరదరాజులు నాయుడుగారు (సువర్ణనంఅందుసన్ను, ఫొటోషాపు) శ్రీరంగం.

21 శ్రీ శ్రీమాన్ శ్రీ పరవస్తు గోవిందాచార్యస్వాములవారు, వేదాంతవిద్వాన్, మహారాజా సంస్కృతకళాశాల, విజయనగరం.

22 మ॥ రా॥ శ్రీ చెన్నూరు రామచంద్రరావుగారు, మహస్సబు, వనపర్తిసంస్థానం, వనపర్తి, నైజాం.

23 శ్రీ శ్రీమాన్ చిలకమర్రి అప్పలాచార్యులుగారు తెల్లాపూర్, నైజాం.

24 " పంచాంగం వెంకట శఠగోపాచార్యులుగారు, ఏలూరు.

25 " నల్లాని చక్రవర్తుల వెంకట వరదాచార్యులు గారు, మద్దిరాల, నైజాం.

## సామాన్యసభ్యులు:

1 శ్రీ శ్రీ కొత్తా వెంకటరత్నంజమీందారుగారు (మానిసిపల్ కౌన్సిలర్లు) ఏనాం (ఫ్రెంచి.)

2 " వాళం కృష్ణారావుగారు (గౌతమీగ్రంథాలయాధ్యక్షులు) రాజమండ్రి.

3 " నంబూరు వెంకటఅప్పలాచార్యులుగారు, సింహాచలం.

4 " అకలంకం రంగభాష్యమయ్యంగారు, సంగడీగుంట, గుంటూరు.

5 " సంద్యాల శేషాచార్యులుగారు, నరసింహస్వామి ఆలయం, గుంటూరు.

6 " కొండవలగంటి వెంకటాచార్యులుగారు, కొత్తపట్టణం, గుంటూరుజిల్లా.

7 " అరుట్ల శేషాచార్యులుగారు, వరంగల్, మఠవాడ, నైజాం.

## స భ్యు లు.

8 (శ్రీ) శ్రీమాన్ కొండపాక వెంకటాచార్యులుగారు, వరంగల్, బాలనగరం, నైజాం.

9 " గరిమెళ్ళ నర్సింగముగారి రమణయ్య సూరిగారు (కిరాణందుకాణం) రామన్నపేట, వరంగల్, నైజాం.

10 ,, పర్చా రామచంద్రిరావు జమీాందారుగారు, కారేపల్లి, నైజాం.

11 " ఒకమతాభిమానులు.

12 " వ్యాసభట్టరు సింగరాజు నాయబుగారు, గాడేపాడు, నైజాం.

13 " బి. యన్. రంగభట్టరువారు, (కర్ణాటకరాష్ట్రి అర్చకసంఘాధ్యక్షులు) బెంగుళూరు.

14 " ములుగు వెంకటనృసింహాచార్యులుగారు, ఉండ్రాజవరం.

15 " తిరుమల పెద్దింటి సింగరాచార్యులుగారు, అర్చకులు, సింహాచలం.

16 " చామర్తి రాజనృసింహభట్టాచారిగారు, బాలసీమ, ఉర్లాంపోస్టు.

17 ,, శ్రీపతి లక్ష్మీనృసింహాచార్యులుగారు, పెదపారుపూడి గ్రామం, కృష్ణాజిల్లా.

18 ,, చలమచర్ల వెంకటాచార్యులుగారు, వాసపాముల గ్రామం, కృష్ణాజిల్లా.

19 ,, దిట్టకవి సీతారామానుజాచార్యులుగారు, సంతరావూరు, గుంటూరుజిల్లా.

# నిజాం రాష్ట్ర ప్రతినిధి

శ్రీ శ్రీమాన్ విద్వాన్, అమరవాది నారాయణాచార్యులు గారు, వరంగల్, గిర్మాజీపేట, (నైజాం.)

---

N. B. :— నైజాంరాష్ట్రమండలి సభ్యులయొక్క సౌకర్యార్థమై పైనుదహరించినవారిని వరంగల్‌లో యీ సంస్థకు ప్రతినిధులనుగా యేర్పాటుచేసియున్నాము. కాన ఆదేశపు ప్రజలు వారితోనే వ్యవహారములను జరుపుకొన ప్రార్థితులు.

బజారుమారకము విషయ మెటులున్నను మా సంస్థవిషయములో బండీరూపాయ 1కి హాలీ రు 1-2-6 చొ॥ చెల్లించినచో అంగీకరించి పుచ్చుకొనుచుండెదము.

ఇంకను హెడ్డాఫీసుతోనే ముఖ్యవ్యవహారముల నేమైనా ప్రత్యేకముగా జరుపనిచ్ఛగించు నిజాంరాష్ట్రవాసులు యీ సంస్థ పేరిటనే—"వరంగల్ జిల్లా, పాల్వంచ తాలూకా, 'బూరుగంపాడు పోస్టు"—ద్వారాగా "భద్రాచలము'నకు నైజాంపోస్టులోనే వ్రాసుకొనవచ్చును.

—సంపాదకుడు.

---

# సంస్థ విషయములు

(కృతజ్ఞత, అభినందనము, విన్నపము, వాగ్దానములు, సంస్థయందలి గ్రంథపట్టిక మున్నగునవి.)





# పాంచరాత్రాగమ

## ప్రశస్తతా.

శ్లో॥ బ్రాహ్మణస్సర్వవర్ణేషు - యతిశ్చాశ్రమిషూత్తమః
యద్వద్గంగాచతీర్థేషు - దైవతేష్వపిచాచ్యుతః
తద్వత్సర్వేషు శాస్త్రేషు - పంచరాత్రం ప్రశస్యతే ॥
ఇదంపవిత్రం పాపఘ్నం - శాస్త్రంభవవినాశనం
సంసారార్ణవమగ్నానాం - కర్మపాశానుపేయుషాం
మహాపోతేన సదృశం - తారకం భవసాగరాత్ ॥

— పాద్మతంత్రే



శ్లో॥ పాంచరాత్రం మహద్దివ్యం - శాస్త్రం సంప్రీతివిభావనం
విశేషేణాధిగంతవ్యం - గీతం భగవతా స్వయం ॥

— సంహితాంతరేషు ॥

# వాగ్దానములు - విన్నపము.

ఈ గ్రంథమాలను గురించి తమ వజ్రాయుధపత్రికలో యుచితప్రకటన మొనరించుటయేగాక, దేవాలయకమిటీవారి ద్వారాగా తగు సహాయమున్ను కలిగింప వాగ్దాన మొనరించిన బ్రహ్మశ్రీ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి (రాజమండ్రి) గారికిన్ని— ఇదేవిధముగా హిందూసుందరీపత్రికాముఖమున సాయపడ వాగ్దాన మొనరించిన శ్రీ బాలాంత్రపు శేషమాంబ, మాడభూషి చూడమ్మ (కాకినాడ) గార్లకున్ను—తమకు దేవాలయకమిటీతో గల సందర్భము ననుసరించి తాము స్వయముగా సభ్యులగుటయేగాక తమ కమిటీవారిచేతను అర్చకులు మున్నగువారిచేతను తగు సాయమును గల్గింప నంగీకరించిన మ॥ రా॥ శ్రీ శ్రీ జే. సత్యనారాయణమూర్తి (తూ. గోదావరిజిల్లా టెంపుల్ యిన్‌స్పెక్టరు రాజమండ్రి) గారికిన్ని— తమవద్దనున్న సర్వగ్రంథములను సమర్పించుచు, పోషకులు సభ్యులు మున్నగువారిని చేర్చి తగు సహాయమును కలిగించుటలోనున్ను, గ్రంథప్రచురణవిషయమందున్ను, అముద్రితగ్రంథసంపాదనమందున్ను కుడిభుజమువలె మాకు దోడ్పడెద మని వాగ్దాన మొనరించిన శ్రీమాన్ రొంపిచర్ల భట్టరు శ్రీనివాసాచార్యులు (వైఖానసాశ్రమం, ఆకులమన్నాడు) వారికిన్ని—సభ్యుల చేర్చుటలోను తాము యావచ్ఛక్తి నన్నివిషయములయందున్ను తోడ్పడుటలోను వాగ్దాన మొనరించిన శ్రీమాన్ ఫణిహారం తిరువేంగళాచార్యులు(కాకినాడ) గారికిన్ని- తమలైబ్రరీలోగల ముద్రితాముద్రితగ్రంథముల నెల్ల దయచేసి సాయపడెద మని యానతిచ్చిన శ్రీమాన్ శ్రీ పరవస్తు శ్రీనివాసస్వామి (ఆర్షలైబ్రరీ, విశాఖపట్టణం) గారికిన్ని— "శ్రీల.. స్మృతంత్రము" సకల్యే ముద్రణవ్యయమునంతయును యీ మాఘమాసములో నిచ్చుటకై వాగ్దానముచేసిన శ్రీమాన్ కామసముద్రం విద్వత్కవికుంజరం వేంకటకృష్ణమాచార్యులు (ఆయుర్వేదవిద్వాన్, ప్రస్తుతం భద్రాచలం) గారికిన్ని— [illegible] తగు సాయ

మొనరించి యొకగ్రంథమును ముద్రించి యిచ్చుటకై యనుమతించిన మ॥ రా॥ శ్రీ శ్రీ గూడూరు లక్ష్మణరావు జమీందారు (బెజవాడ) గారికిన్ని—ప్రథమగ్రంథమును చూచినపిమ్మట రెండవ గ్రంథముద్రణమునకు తోడ్పడి పోషకులుగా చేరెద మని యనుగ్రహించిన మ॥ రా॥ శ్రీ శ్రీ కొత్తా వెంకటరత్నం జమీందారు (పనాం, ఫ్రెంచి) వారికిన్ని—సుమారొక 25 మందికి తక్కువగాని సభ్యుల నేర్పాటుచేసి తాము న్ను సభ్యులై తగురీతిగా సహాయపడ వాగ్దాన మొనరించిన శ్రీమాన్ శ్రీ కోసూరి అప్పలాచార్యులు (గుంటూరుతాలూకా, వైకుంఠపురం) గారికిన్ని—తమ యావచ్ఛక్తిని వినియోగించి తమ దేశసంచారమునంతయును యిద్దానికి సహాయభూతముగా నొనరింప యత్నించుచున్న బ్రహ్మ శ్రీ, శ్రీ, కప్పగంతుల కృష్ణమూర్తి (కళింగపట్నం) గారికిన్ని—తగుసభ్యుల చేర్చుటలోను గ్రంథములను ముద్రణార్థమై తయారుచేసి యిచ్చుటలోను వ్యాఖ్యాన టీకాతాత్పర్యాదుల వ్రాసియిచ్చుటలోను తగువిధముగా సహాయభూతులై యుండ ననుగ్రహించిన శ్రీమాన్ శ్రీ పరవస్తు గోవిందాచార్యులు (శ్రీ విజయనగరం మహారాజాసంస్కృతకాలేజి వేదాంతవిద్వాంసులు) గారికిన్ని—ఇంకను కొద్దిగనో గొప్పగనో మాకు తోడ్పడెదమని వచించిన తదితరమహాశయులకును—

ఈవిజ్ఞాపనాపత్రమును సవినయముగా సమర్పించుచు, వారివారి వాగ్దత్తముల నొకపర్యాయము జ్ఞప్తిచేయుచున్నారము. తప్పక నీ మహానీయుల సహాయముల గురించిన వివరములన్నింటిని మాద్వితీయ ప్రచురణమందే సూచించి మాకృతజ్ఞతల నందజేయగల మనియు, యిమ్మహానీయులు మిగిలిన దేశీయప్రముఖుల కందరకును మార్గదర్శకులై వెలయగలరుగాన మున్ముందు మాసంస్థకు ఉదారహృదయులగువారలచే జరుగబోవునట్టి యమూల్యసహాయములకెల్ల వీరలే ముఖ్యకారణభూతులై సుస్థిరముగా నీసంస్థను నిలువబెట్టి లోకోపకార మొనరించిన మహాఫలమునున్ను పొందగలరనియు, త్రికరణశుద్ధిగా విశ్వసించుచున్నారము.

శ్రీరామచంద్రమూర్తి వెంటనే మా కీ మహనీయుల సహాయ ముల నందుకొనునట్టి భాగ్యమును గల్గించి యవ్వారల సర్వదా రక్షించుగాక!

ఇట్లు విన్నవించు భవద్విధేయుడు,
సంపాదకుడు.

## ప్రార్థన.

మాసంస్థయం దత్యంతాదరభావముతో మావిజ్ఞప్తి నాలించి ఈమహాక్షేత్రమునందు తమపేరిట శాశ్వతముగా "శ్రీపాంచరాత్రాగమశాస్త్రసర్వస్వగ్రంథనిలయశాఖ"లో నుంచుటకుగాను యర్పించిన యీాదిగువ నుదహరించిన ముద్రితాముద్రితగ్రంథములను కృతజ్ఞతతో నందుకొనుచున్నారము. దేశహితైకమతులగు యుత్తమపురుషులెల్లరు వీరలమార్గమునే యనుసరించి తమయొద్దగల పాంచరాత్రగ్రంథములను ముద్రితాముద్రితములలో నేవైనను-యేభాషలోనున్నను-శాశ్వతముగాగాని, క్రయమునకుగాని, తగ్గింపువెలకైనను లేక సంపూర్ణమగు వెలకైనను సరే, లేదా వాటికి మేము ప్రతులు వ్రాసికొని తిరిగి పంపునట్టిపద్ధతిపైనైనను (తగుమైనవాయిదాలలో మావద్దనుంచి కొంత ధరావతును చెల్లించుకొనిగాని లేక మాపైగల నమ్మికచే యట్లొనరింపకనేగాని అట్లు పంపుట కవకాశము లేశమైనను గలుగనిపక్షమున మే మచ్చటకువచ్చి ప్రతులు వ్రాయించి తీసికొనుటకుగాని లేక తామే స్వల్పద్రవ్యముతో నట్టి కార్యమును జరుపుటకుగాని పరిమిషనియిచ్చియును) ఈయుత్తమకార్యమును సక్రమముగా నిర్వహింపజేయ మిక్కిలియును ప్రార్థించుచున్నారము.

మా కుచితముగా గ్రంథముల నర్పించిన యీాదిగువ నుదహరించిన మహాదాతల కా సర్వేశ్వరుడు ఆయురారోగ్యాద్యష్టైశ్వర్యముల నొసంగి నిరంతరమున్ను కాపాడునుగాత యని త్రికరణశుద్ధిగా వేడుచున్నారము.

మాసంస్థ కుచితముగా గ్రంథముల కరుణించిన మహాశయులవివరము.

1 శ్రీమదిత్యాది శ్రీమాన్ శ్రీ ఫణిపురం రంగస్వామిభట్టరువారు, శ్రీపాంచరాత్రాగమవిద్వాన్, శ్రీ మైసూరు మహారాజా సంస్కృతకాలేజీ విద్వాంసులు, మైసూరు.

(1) పాద్మసంహితా-తెలుగులిపి - 2 వాల్యూములు - వెల రు 10-0-0 లు

(శ్రీ యాదవాచలమఠమువారు ప్రకటించినది.)

(2) శ్రీ భగవదాలయనిత్యార్చనాపద్ధతిః-తెలుగులిపి వెల రు 2-8-0 లు.

(స్వయముగా రచించిన 'దీపికా' సహితము.)

2 మహారాజశ్రీ టి. వి. కుబేంద్రరాజుగారు, పెయింటరు, అండు ఫొటోగ్రాఫికు ఆర్టిస్టు, మదరాసు.

(1) అహిర్బుధ్న్యసంహితా- నాగరలిపి- 3 వాల్యూములు-ఇంగ్లీషుపీఠిక సహా-వెల రు 15-0-0 లు.

(శ్రీ అడయారు లైబ్రరీవారు ప్రకటించినది.)

3 బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన శ్రీ సిసిట్ల అరుణాచలయ్యగారు, మద్రాసు.

(1) అహిర్బుధ్న్యసంహితా - (నాగరలిపి) ఇంగ్లీషు భూమిక లేని 2 వాల్యూములు-వెల రు 13-0-0 లు.

(శ్రీ అడయారు లైబ్రరీవారు ప్రకటించినదే)

4 శ్రీమదిత్యాది శ్రీమాన్ శ్రీమయూరం అప్పలాచార్యులుగారు. దేవునికడప.

(శ్రీ. జి. యల్. శాస్త్రిగారిద్వారాగా పంపినవి.)

(1) కపింజలసంహిత - తెలుగులిపి. వెల రు 1-0-0

(శ్రీ కడప టి. సుబ్బారావుగారి పీఠిక గలది. ఎవ్వరు యెచ్చట ప్రకటించిరో తెలియదు.)

(2) పాంచరాత్రరక్షా - తెలుగులిపి-తాళపత్రప్రతి-సమగ్రగ్రంథము.

(3) కపింజలసంహితోక్త ఉత్సవప్రయోగవిధిః-తెలుగులిపి-తాళపత్రప్రతి.

5 శ్రీ మదిత్యాది శ్రీమాన్ తూప్పుల్ దొరస్వామిఅయ్యంగారు, శ్రీవైష్ణవగ్రంధరత్నాకరశాలాధిపతులు, బెంగుళూరు.

(1) గాయత్రీ తంత్రము-తెలుగులిపి వెల రు0-12-0 లు.

(2) గాయత్రీ మంత్రమాల-తెలుగులిపి 0-6-0 లు.

వీరింకను శ్రీ యోగిపార్థసారథి అయ్యంగారు ప్రకటించిన "ఈశ్వరసంహితా" మున్నగు కొన్ని గ్రంథముల నుచితముగా సమర్పింప వాగ్దాన మొనరించిరి.

—సంపాదకుఁడు.



# అభినందనము

శ్రీ బందరుపురవాసులున్ను రిటైర్డుసబుజడ్జీలున్ను మహా విద్వాంసులున్నుయగు బ్రహ్మశ్రీ వావిలాల వేంకటశివావధానులు గారు మహోదారహృదయులై మాయుద్యమమును కొంతవరకు స్వయముగా వీక్షించి శ్రీఅడయారులైబ్రరీ (మదాసు)యందు గల వ్రాతప్రతులకన్నింటికిని కాపీలు వ్రాయించుకొనుటకై పరిమిషను పొందగల్గుటకుగాను తమమిత్రులగు సదరు లైబ్రరీడైరెక్టర్లకు మంచిసిఫారసు నొనరించియున్నారు. వీరిమూలకముగా మే మికార్యమునందు తప్పక కృతకృత్యులమయ్యెద మని నమ్ముచు, అట్టిమహానీయమూర్తులయొక్క దేశాభిమానమును, సత్కార్యనిర్వహణాభిలాషను, మహోదారహృదయమును మిక్కిలియు కొనియాడుచున్నారము.

ఇట్లు విన్నవించువిధేయుడు,

—సంపాదకుడు.



ప్రస్తుతము

"శ్రీపాంచరాత్రాగమశాస్త్రసర్వస్వగ్రంధనిలయ శాఖ"లోగల

# ముద్రితాముద్రిత గ్రంథముల పట్టికా.

---

ముద్రితములు:—

1 పాద్మసంహితా-మూలగ్రంధము-తెలుగులిపి - 2 వాల్యూములు-వెల రు 10-0-0.

(యాదవాచలమఠమువారు బెంగుళూరులో ప్రకటించినది)

2 బృహద్బ్రహ్మసంహితా-మూలగ్రంథము-నాగరలిపి-వెల రు2-8-0 (ఆనందాశ్రమ ప్రెస్, పూనా)

3 అహిర్బుధ్న్యసంహితా:—మూలగ్రంథము - నాగరలిపి - 2 వాల్యూములు వెల రు 13-0-0 (అడయారు లైబ్రరీ, మద్రాసు)

4 శ్రీ పాంచరాత్ర శాస్త్రోపోద్ఘాతము:—(Introduction to Pancharatragama) విమర్శగ్రంథము - ఇంగ్లీషులిపి వెల రు 2-8-0 (అడయారు లైబ్రరీ, మద్రాసు)

5 ఈశ్వరసంహితా:—మూలగ్రంథము-నాగరలిపి-వెల రు 7-8-0 (సుదర్శనప్రెస్, కంచీ)

6 సాత్త్వతసంహితా:—మూలగ్రంథము-నాగరలిపి-వెల రు 3-0-0 (సుదర్శనప్రెస్, కంచీ)

7 ప్రపన్నధర్మసారసముచ్చయము:— నిర్ణయగ్రంథము-తెలుగులిపి వెల రు 3-0-0 (శ్రీవైష్ణవగ్రంథరత్నాకరశాల, బెంగుళూరు)

8 శ్రీపాంచరాత్రరక్షా:—విమర్శగ్రంథము - తెలుగులిపి - వెల రు 2-0-0 (శ్రీవైష్ణవగ్రంథరత్నాకరశాల, బెంగుళూరు)

9 విష్ణుతిలకసంహితా:—మూలగ్రంథము-తెలుగులిపి - వెల 3-0-0 (ఇయ్యుణ్ణి రాఘవాచార్లుగారు, బెంగుళూరు)

10 పరాశరసంహితా:—మూలగ్రంథము-తెలుగులిపి - వెల రు2లు. (ఇయ్యుణ్ణి రాఘవాచార్లుగారు)

11 భారద్వాజసంహితా:—మూలగ్రంథము - తెలుగులిపి - అంధ్రవ్యాఖ్యా - వెల రు 3-0-0 (శ్రీవైష్ణవపత్రిక - పెంటపాడు)

12 ఆలయనిత్యార్చనాపద్ధతిః:—ప్రయోగగ్రంథము - తెలుగులిపి - వెల రు 2-8-0 లు (ఫణిపురం రంగస్వామిభట్టరు, మైసూరు)

13 అగస్త్యసంహితా:—మూలగ్రంథము-నాగరలిపి - వెల రు3 లు. (సేటు ఛోటేలాలు లక్ష్మీచందు, ఫైజాబాదు, అయోధ్యజిల్లా)

14 క్రియాకైరవచంద్రికా:—ప్రయోగగ్రంథము - గ్రంథాక్షరి- వెల రు 2-8-0 లు (సుదర్శనప్రెస్ - కాంచీ)

15 భగవన్నిత్యారాధనక్రమః—ప్రయోగగ్రంథము - కన్నడలిపి - వెల రు 0-8-0 లు (శ్రీవైష్ణవగ్రంథరత్నాకరశాల, బెంగుళూరు)

16 నారదపాంచరాత్రం—మూలగ్రంథమునా-గరలిపి-వెల 2-0-0లు (పం. జోషారాంముకుందజీ, బొంబాయి)

17 పాద్మోక్తారాధనవిధిః—ప్రయోగగ్రంథము - గ్రంథాక్షరి - వెల రు 0-6-0 లు (సుదర్శనప్రెస్, కంచీ)

18 కపింజలసంహితా:—మూలగ్రంథము-తెలుగులిపి-వెల రు 1-0-0 (శ్రీ. సుబ్బారావుగారు, కడప. సీరికగలది)

19 శ్రీరామోత్సవరత్నాకరః :—ప్రయోగగ్రంథము - తెలుగులిపి వెల రు 3-0-0. (పట్టాభిరామశాస్త్రి, మద్రాసు)

20 శ్రీవైఖానససారసంగ్రహః:—విమర్శగ్రంథము-తెలుగులిపి - వెల రు 0-8-0 (శ్రీవైష్ణవగ్రంథరత్నాకరశాల, బెంగుళూరు)

21 శ్రీ విష్ణుసంహితా:—మూలగ్రంథము- నాగరలిపి-వెల రు 4-8-0 (త్రివేండ్రం గవర్నమెంటువారు)

22 తంత్రశుద్ధాఖ్యప్రకరణం:—విమర్శగ్రంథము- నాగరలిపి- వెల రు 0-6-0 (త్రివేండ్రం గవర్నమెంటువారు)

N. B.— ఇవిగాక మరికొన్నిగ్రంథములున్నను అవి సంపూర్తిగా యీ పాంచరాత్రాగమవిషయమే కానందున యిందు చేర్చక వేరుగా నుంచడమయినది.

అముద్రితగ్రంథములయొక్క జాబితా యీపర్యాయము ప్రచురింపబడే గ్రంథములో నుదహరింపబడును.

ఈపై నుదహరించిన ముద్రితగ్రంథములలో గూడ ప్రస్తుతము 2, 3 గ్రంథములు తప్ప మిగిలినవాటికి ప్రతులు దొరుకవు. అయినను యెవ్వరైనా యేగ్రంథముయొక్క సంపూర్తి అడ్రెస్సునైనా కోరే యెడల తప్పక వ్రాసి పంపనగును.

—సంపాదకుడు.



# కావలెను.



శ్రీ పాంచరాత్రాగమమునకు సంబంధించిన గ్రంధములు ముద్రితాముద్రితములలో నేవియైనను సరే యేభాషయందున్నను సరే మాకు కావలయును. ఉచితముగా పంపినను లేక మూల్యమునకు విక్రయించినను మేము పుచ్చుకొనెదము. వివరముల నీ క్రింది అడ్రెసుకు వ్రాయవలయును.

ఇట్టిగ్రంధములు తమవద్ద లేకున్నను ఉన్నస్థలముల యొక్క వివరములనైనను యెరింగించినవారికి ఆగ్రంధములు మా కావశ్యకములైన యెడల మంచిబహుమతి యొసంగబడును.

చురుకుగాను నమ్మకముగాను సభ్యులు వగైరాలను చేర్చు విషయములలో పనిచేయుటకు నెలజీతమునైనను ధారాళమగు కమీషనైనను పనిచేయగల్గిన పలుకుబడిగల యేజంట్లు ప్రతి-చోటను విరివిగా కావలయును. వివరముల కీక్రింది అడ్రెస్సుకు నేడే వ్రాయుడు.

సంపాదకుడు,
శ్రీ పాంచరాత్రాగమశాస్త్రసర్వస్వము,
భద్రాచలం, తూ॥ గోదావరిజిల్లా.



# ముఖ్యమగు సూచనము.

## సభ్యులకు.

1 వృధావ్యయమును తగ్గించుకొన నెంచునట్టి మాసభ్యులు సంవత్సర మొత్తముపై ప్రకటింపబడునట్టి 1200 పుటలుగల సంపుటములన్నిటికిని యొకేపర్యాయము రు 10 లున్ను మనియార్డరుచేసినచో అన్నిగ్రంథములును ఖర్చులు మేమే భరించి రిజష్టర్డు పార్శెలుగా పంపుదుము.

2 ప్రస్తుతము వీ. పీ. లను పోస్టులో 3 దినములకన్న నెక్కువ యుంచేయెడల డెమరేజీచార్జియున్ను భరించవలసివచ్చును. కాన వెంటనే వీ. పీ. లను చెల్లించి గ్రంథములను పుచ్చుకొనవలయును.

3 వీ. పీ.లు వగైరాలు తిరుగగొట్టినచో యానష్టము నట్లు త్రిప్పివేసినవారే భరించవలసియుండును.

4 జబాబుకోరువారలు రు 0-1-0 పోస్టుబిళ్లలు పంపవలయును.

5 సభ్యులుత్తరము వ్రాయునప్పుడు తమసంఖ్య నుదహరించవలయును.

6 మాయుత్తరము నెంబరు నుదహరించుచు మాకు ప్రత్యుత్తరములు వ్రాయవలెను.

## వర్తకులకు.

మాగ్రంథములను టోకుగా కొని విక్రయించునట్టి వర్తకులకు మంచికమీషన్ యియ్యబడును.

## బహుమతి.

1 ఏపుస్తకమునైనా 6 ప్రతులొకేసారి తెప్పించుకొనువారలకొక్కప్రతియున్నూ, రు 5 లకు తక్కువగాని ఆర్డరుకు పోస్టుఖర్చులున్ను బహుమతిగానిచ్చెదము.

## ముఖ్యమగు సూచనము

2 ఎవ్వరైనను పోషకులు మున్నగు తరగతులలో అయిదుగురికి తక్కువగాని సభ్యులను చేర్చేయెడల ఆసంఖ్య తగ్గకుండా యున్నంతకాలమున్ను అట్లు చేర్చినవారికిగూడా ఆతరగతి సభ్యత్వహక్కులను బహుమతిగా నొసంగెదము.

3 మాకు విరివిగా తోడ్పడువారలకు వారివారి యోగ్యతల ననుసరించి ద్రవ్యరూపకమగు బహుమతులున్ను యొసంగబడును.

## ఉ చి త ము .

నిరుపేదలగువారలకు (ఆవిధముగా ఋజువు పర్చుకొనిన యెడల) ప్రవేశరుసుమును పూర్తిగా తగ్గించివేసి ఉచితముగానే చందాదారులనుగా జేర్చుకొని అట్టివారి కిచ్చునట్టిధరకుమాత్రమే వీరలకున్ను మాగ్రంధముల నొసంగెదము.

—సంపాదకుడు.



పాంచరాత్రాగమవిషయమునకు సంబంధించిన సలహాల నొందగోరు వారలకున్ను సంశయముల దీర్చుకొన నాశించువారలకున్ను మంచితరుణము.

## ముఖ్యమగు గమనింపు.

ఎవ్వరికైనను శ్రీపాంచరాత్రాగమశాస్త్రవిషయములో నెయ్యదియైనా సందేహము గల్గినచో మావల్ల వ్రాసి తెలిసికొనవచ్చును. మాసభ్యు లిందులకై పోస్టుఖర్చులనిమిత్తం రు 0-4-0 పోస్టేజీబిళ్ళల నంపి ఉచితముగానే సలహాలను పొందవచ్చును. ఇతరులు సామాన్యవిషయముల కన్నింటికిన్ని రు 1-0-0 రుసుముతోగూడా చేర్చి రు 1-4-0 లు ముందుగనే మనియార్డరు చేయవలయును. విషయాధిక్యత ననుసరించి యొక్కొక్కప్పుడు యెక్కువచార్జియున్ను భరించవలసివచ్చును. అందుల కంగీకారములేనివారల సొమ్ము తిరుగా మనియార్డరు చేయబడును. ఖర్చులు వారే భరింపవలెను.

ఇట్లు,

సంపాదకుడు.

శ్రీ పాంచరాత్రాగమశాస్త్రసర్వస్వము,

భద్రాచలం, తూర్పుగోదావరిజిల్లా.



# కార్యాలోచనాసభ్యుల సహాయము.

ఈ సంస్థయం దత్యంతాభిమానముతో కార్యాలోచనాసభ్యులుగా చేరిన 25 మంది మహాశయులలోను యీాదిగువ నుదహరించినవారలు యీాదిగువ నుదహరించినవిధముగా సంస్థయొక్క అభివృద్ధికై తోడ్పడి యున్నందున వీరలకు మాహృదయపూర్వకకృతజ్ఞతాభివందనముల నర్పించుచు నిగిలినవారలుకూడ వీరిమార్గమునే యనుసరించి సాధ్యమగునంతత్వరలో తమతమ వాగ్దత్తములను కార్యరూపముగా పరిణమింపజేయ కడుంగడు వేడుచున్నారము.

1 శ్రీ శ్రీమాన్ విద్వాన్ అమరవాది నారాయణాచార్యులుగారు, వరంగల్, నైజాం (ముగ్గురు సామాన్యసభ్యులను చేర్చుటచేతను)

2 ,, అకళంకం రంగభాష్యమయ్యంగారు, గుంటూరు, (కొందరిచేత సభ్యులుగా చేర వాగ్దానము చేయించి, తమతండ్రిగారు వ్రాసిన 50 పాంచరాత్ర (వ్రాత) గ్రంథముల నొసంగి, వారిపేరిట నొక ప్రధానపోషకత్వము నేర్పాటు చేయుటచేతను)

3 ,, డాక్టరు డి. రంగాచార్యులుగారు, మద్రాసు (వైఖానసపత్రికలో నుచితముగా యీసంస్థనిబంధనలను ప్రకటింపించి యీపత్రికాముఖముగానే వైఖానసులను తదితరులను యీసంస్థకు తోడ్పడ ప్రోత్సహించుటచేతను.)

4 ,, చలమచర్ల శోభనాద్రాచార్యులుగారు, ఉంగుటూరు (ముగ్గురు సామాన్యసభ్యులను చేర్పించి శ్రీ ప్రశ్నసంహితను సంపాదించి పెట్టుటచేతను.)

5 ,, నండూరు వెంకటప్పలాచార్యులుగారు, సింహాచలం (ఒక్క సామాన్యసభ్యుని చేర్పించి కొందరిచేత

పోషకులుగాను సభ్యులుగాను చేరుటకు వాగ్దానములు చేయించుటచేతను.)

6 ,, దిట్టకవి వెంకట నరసింహాచార్యులుగారు, తుళ్లూరు (శ్రీపురుషోత్తమసంహిత యను యముద్రితగ్రంథమును యీసంస్థయందు ద్వితీయపుష్పముగా ప్రకటింప శ్రీదనకుధరం వెంకటరంగాచార్యులువారు (తెనాలి) ద్వారాగా యీసంస్థకు దయచేయించుటచేతను)

అమూల్యమగు సాహాయ్యము నొనరించి తమతమ నిర్మలాభిమానములను వెల్లడించియుండిరి. శ్రీరామచంద్రమూర్తి వీరికి ఆయురారోగ్యాది యభీష్టఫలముల నెల్ల ప్రసాదించి సర్వదా రక్షించునుగాక !

ఇంకను వీరలు యథాశక్తి కృషిసల్పి యీసంస్థయొక్క సంపూర్ణకార్యక్రమము వెంటనే ప్రారంభింపబడునట్లాశీర్వదించి యితరుల కాదర్శప్రాయులై వెలయుదురుగాక !

—సంపాదకుడు.





# THE IMPORTANCE OF
# Pancharatra Litarature.



" It is an unexplored field . . It was also unknown, until recently that other Samhitas are extent. .. To obtain a general view, however imperfect, of the material to be taken into account, is evidently the first thing required of any one approching an unknown Literature.

F. OTTO SCHRADER Esq , Ph D.
*Director,*
Adyar Library, MADRAS



# ప్రముఖుల యభిప్రాయములు.

I

శ్రీమదిత్యాది శ్రీమాన్ శ్రీఘటిపురం రంగస్వామిభట్టరువారు,
శ్రీపాంచరాత్రాగమవిద్వాన్, మహారాజాసంస్కృతకాలేజీ,
573, కాలేజీరోడ్డు, మైసూరు.

MYSORE,
18—5—1929.

"Since I find you taking a good deal of interest in Pancharatra Literature I shall have great pleasure in helping you.. ....... ........................... ... ........................................................
Thank you once again for your solicitude in the improvement of Pancharatra Litarature and hope to hear from you at your earliest convenience. *I am,*

*Yours Sincerely,*
(Sd) N. RANGASWAMI BHATTAR.

II

శ్రీమదిత్యాది శ్రీమాన్
శ్రీ ప్రతివాది భయంకరం అనంతాచార్యులు అయ్యవార్లంగారు,
శ్రీ సుదర్శనీప్రెస్ ప్రొప్రయిటర్లు, 'మంజుభాషిణీ' పత్రికాధిపతులు,
'శాస్త్రముక్తావళీ' గ్రంథమాలికాసంపాదకులు,

కాంజీవరం,
డి 28—6—30.

శ్రీమాన్ సీతారామానుజాచార్యులుగారికి, భద్రాచలం.

"......మీరు ప్రారంభించియుండే కార్యము చాలా శ్రేష్ఠమైనది శ్రీపాంచరాత్రాగమోద్ధరణకార్యములో మీకు మావల్ల అయినమట్టుకు సహాయముచేయ సర్వసంసిద్ధులము.........
ఇంతే సేవింపులు."



III

శ్రీ

జయతి పరవస్తు శబ్ద। ప్రకటితహరిపష్ఠరూపతా విభవా।
శ్రీభట్టనాథగురు। వర్యవంశపరంపరా మహతీ॥

శ్రీమద్వేదమార్గేత్యాది శ్రీసౌమ్యజామాతృమునివరపరిగణితాష్టదిగ్గజాంతర్గతపీఠస్థ శ్రీమదార్షమతోద్ధార కేత్యాద్యనేకబిరుదాంకిత, ఇతిహాసకులపతి శ్రీమాన్ శ్రీపరవస్తు లక్ష్మీనరసింహస్వామి అయ్యవారలుగారు,

ఆర్షాలైబ్రరీ, విశాఖపట్టణము.
ది 13—1—1931.

"తతః, మీరు 6-1-31 తేదీన వ్రాసిన యుత్తరమును చూచితిని. అందలివిషయములు అత్యంతము లోకోపకారకములున్ను సర్వజనాదరణీయములును అయియున్నవి ......

నాకు తెలిసినవిషయములలో మీసంస్థకు నా శక్తివంచనలేకుండా సహాయముచేయుటకు నా కెట్టియభ్యంతరమున్ను లేదు. ..."

IV

శ్రీమదిత్యాది శ్రీమాన్
శ్రీ రొంపిచర్ల భట్టరు శ్రీనివాసాచార్యులుగారు,
(అర్చకులు) మేనేజరు, శ్రీ వైఖానసవిద్యానిలయం, ఆకులమన్నాడు,
గూడూరుపోస్టు, కృష్ణాజిల్లా, ది 29-12-1930.

(1) "అనేక దాసోహములు.

.........ఈ మహోత్తరవిషయములో తప్పక తమరు కోరిన అన్నివిషయములలోను సహాయపడెదను......"

ది 7—1—31.

(2) "శ్రీనివాసుడు అనేకవందనములు.

తాము కటాక్షించిన శ్రీముఖం చేరినది. సమస్తకార్యములున్నూ శ్రీ రామచంద్రప్రభుకృపావల్ల పూర్తికాగలదు......

మాతమ్ముడు మదరాసులో గలడు. అతనితో చెప్పి "అడయారు" లోని గ్రంథములకై తగు ప్రయత్నంచేస్తాను.........ఈ చిక్కులు తీరినంతనే శీఘ్రముగా భద్రాద్రి రామదర్శనమునకు రాగలను. అప్పుడే మాతాలూకు గ్రంథములను లైబ్రరీకి యిస్తాను. "కపింజల సంహితా" తెలుగులిపి—"శ్రీప్రశ్న సంహితా" గ్రంధాక్షరి—ఈ రెండు పుస్తకములును రిజిష్టరుచేసి పంపుకొనెదను.........."

## V

శ్రీ శ్రీమాన్ కోయిల్ కందాడై వీరరాఘవాచార్యులుగారు,

సింహాచలం, ది 2-2-31.

"మహాశయా!

తాము ఖిలమైయున్న పాంచరాత్రాగమసంహితలనన్నింటిని క్రమముగా ముద్రింపించి, లోకమున కందజేయు మహోద్యమము నుద్దేశించినందుల కెంతయును సంతసమును జెందుచున్నాడను......"

శ్రీ శ్రీమాన్ శ్రీవిద్వాన్ అమరవాది నారాయణాచార్యులుగారు,

వరంగల్, గిర్మాజీపేట (నైజాం) ది 24-1-31.

"దాసానుదాసుడు అమరవాది విద్వాన్ నారాయణదాసుడు తాఖండదక్కై యనునట్లు దండవత్ప్రణామముల నర్పించి విన్నవించు చున్నాడు.

దేవరవా రత్యనుగ్రహపూర్వకముగా గృపజేసిన శ్రీముఖము శిరసాలంకృతమైనది. దేవరవారి శ్రీసూక్తిపరంపరావిన్యస్తసప్తపత్రిక సప్తసముద్రముల నతిక్రమించి సప్తావరణముల నతిక్రమించినది. విపులమైన యుపన్యాసము ధురంధరమైనది. దేవరవారి శ్రీపాంచరాత్ర శ్రీకోశసంపాదనపరిశ్రమ యవాఙ్మానసగోచరము. దాసుని విషయములో దేవరవా రాజ్ఞాపించిన రీతిగనే బద్ధుడను......దాసుణ్ణి కార్యోపయోగి యాలోచనాసభ్యుణ్ణిగ చేర్చుకొనుటకు కుతూ

హాలముగలవారలై యున్నట్లు అనుగ్రహించినారు. అట్టి యధికారము నకు శక్తుడను గాకపోయినను "రామభూసుర" న్యాయముగా ఆజ్ఞకు బద్ధుడను........సర్వశేషిసంకల్పప్రకారము దేవరవారిపరిశ్రమ సఫలముగా నెరవేరగలదు. విశ్వాసముగా నిర్భరులై వేంచేసియుండ గలరు.....చక్రవర్తి త్తిరుమకనారుపిరాట్టి కృపవలన దేవరవారి ప్రయత్నము సఫలము...సర్వాపరాధములను క్షమించగలరు...
భవత్ప్రియత్నసఫలకామి."

---

## VII

శ్రీ శ్రీమాన్ అకళంకం రంగభాష్యమయ్యంగారు,
శ్రీసీతారామాంజనేయఆలయం, సంగనిగుంట, గుంటూరు,

"స్వామీ! ది 28—1—31.

ప్రకృతకాలంబున సర్వసంఘంబులును వారివారిమతప్రచార మునకును స్వసంఘాభివృద్ధికిని పునాదులగు గ్రంథమాలాపదనామాంకితములగు పత్రికాతరువులస్థాపించి, తత్తన్మతసంబంధకుసుమావళి ప్రకాశింపజేయుచు, పాఠకలోకమునకు బరమానందమొసంగుచుండ మోక్షప్రదంబును వివిధవిషయవిచక్షణంబును శ్రీవిశిష్టాద్వైతసిద్ధాంతమునకు మూలభూతంబును భగవచ్ఛాస్త్రంబును నగు శ్రీ పాంచరాత్రాగమము సార్థకోటిసంఖ్యారూపకమై అష్టోత్తరశతసంహితా భేదమై యలరారియు నేడు నామమాత్రావశిష్టమై నానాటికి విస్మృత వాఙ్మయమగుచుండ, అస్మదాదులకు జిగుప్సకలిగిన్ని చేయునది లేక తచ్ఛాస్త్రాభివృద్ధికై యా జగదాధారుని ధ్యానింపుచుండ సకలకల్యాణగుణాభిరాముండగు శ్రీ భద్రాద్రిరాముని యనుగ్రహమే దేవరవారిరూపమై శ్రీ పాంచరాత్రాగమోద్ధరణమునకు మార్గదర్శకమగుట అస్మదాదుల చిరకాలవాంఛాప్రభవఫల భాగ్యోదయమునకు తార్కాణ మన నొప్పును. ఇట్టి మహోపకారులగు దేవరవారలకు ఆయురారోగ్యాదులొసంగి పరిపూర్ణ మనోరథులనుగా జేయ శ్రీమన్నారాయణుని వేడుచు.........సభ్యునిగా గృపజేయ ప్రార్థించు - దాసన్......"

## VIII

శ్రీ శ్రీమాన్ చలమచర్ల శోభనాద్రాచార్యులుగారు,
ఉంగుటూరు, గన్నవరంపోష్టు - కృష్ణాజిల్లా,
ది 24-1-31.

"దాసానుదాసుడు చరమావధి శోభనాద్రిదాసుడు కృతానేక విజ్ఞాపనంబులు.

అయ్యా,

తాము ది 23-1-31 వ తేదీన ఆంధ్రపత్రిక ద్వారాగా కృపజేసిన దివ్యసూక్తుల వైభవమును గురించి నేను నేడే జన్మించి యీ యానంద మనుభవించినట్లుగా తన్మయత్వ మందితిని. కారణమేమన, యీమనశాస్త్రనామక (ప్రాణ) చేతనోద్ధరణమే! లోగడ యీశాస్త్రగ్రంథములు శిధిలించి ఏకప్రాణావశిష్టమగు చేతనములకు, యీ శాస్త్రగ్రంధోద్ధరణము పంచప్రాణావశిష్టనుగాజేసి, దానిని ఫలవంతమువరకు వ్యాపింపజేసినది. ఈ విన్నపమంతయును మిమ్ములను స్తోత్రముచేయు సంకల్పమాత్రమేగాక మీప్రకటనావలోకనానందాతిశయముచే విషయ మప్రస్తుతమైనను ప్రస్తుతాంశముగా వ్రాసినందుకు మీరు నన్ను మన్నింప ప్రార్థనీయులు...... దేవర్లకృపాపూరిత శ్రీముఖోదయమున కెదురు జూచుచున్నాడను.

కృతానేకవిజ్ఞాపనంబులు.
కరకృత మపరాధం క్షంతు మర్హాంతి సంతః.

ఇట్లు భగత్పాదవిధేయుడు."

---

## IX

శ్రీ శ్రీమాన్ సుదర్శనం అనంత గోపాలాచార్యులుగారు,
కాట్రేనికోన గ్రామం, ముమ్మిడివరం పోష్టు,
అమలాపురంతాలూకా, తూ॥ గోదావరిజిల్లా.
ది 25—1—31.

"......... దేవరవారివల్లో ఆంధ్రపత్రికయందు ప్రకటించుచున్న "శ్రీ పాంచరాత్రదివ్యాగమశాస్త్రసర్వస్వము" శీర్షికను గని

అపరిమితానందమును జెందితిని......... నేటికి అస్మదీయంబయిన దివ్యాగమంబులు అంధకారబంధురంబైన లోకంబున కంజనదానంబు రీతి శ్రీ మైథిలీ రామచంద్రానుగ్రహంబున దేవరవారు ప్రకటింప బద్ధ కంకణులైనందుకు బరమానందంబుతో పునఃపునః సాష్టాంగదాసోహంబు లర్పించుచున్నాడను................శతశోథ సహస్రశః సాష్టాంగదాసోహంబు లర్పించుచున్నాడను.

దివ్యచిత్తే విజయతేతరాం, దాసుడు."

---

X

శ్రీ శ్రీమాన్ నండూరు వెంకటప్పలాచార్యులుగారు,

సింహాచలం, ది 18—1—31.

(A) "తాము ఆంధ్రపత్రికలో ప్రకటించిన శ్రీపాంచరాత్రాగమశాస్త్రగ్రంథమాల విషయం చూచితిని. తాము ఇట్టి సత్కార్య విషయంలో పూనుకొన్నందుకు శ్రీనివాసుడు సర్వదా తమకు మంగళముల జేకూర్చుగాత యని ప్రార్థించుచున్నాడను.

విధేయుడు,

తిరువళ్యానకు తేవలయును."

(B) "దేవరవార్లు ది 24-1-31 వ తేదీని పంపించిన శ్రీముఖము చేరి చాలా ఆనందించితిని. దేవరవార్లు నిర్వహింపదలపెట్టిన యీ ఘనకార్యము శ్రీ వైష్ణవమతస్థుల అభివృద్ధికి చాలముఖ్యమనిన్ని, శ్రీవైష్ణవమతస్థులు మతాభిమానముగల మహనీయులు యిందుకు దోడ్పడి, యీ ఘనకార్యము నిర్వహించుట చాల ముఖ్యమనిన్ని అట్టి ఉదారమనస్కుల నట్లు చేయుటకై శ్రీ సింహాద్రినాథుని మిక్కిలి ప్రార్థించుచున్నాను.

(I) ఈ గ్రంథమాలలో ప్రస్తుతం పరిస్థితులను పురస్కరించుకొని, విచారింపగా సభ్యునిగా చేరుట ఉచితమని శ్రీరామమూర్తి వారి ఆజ్ఞయైనదిగాన యీరోజే రు 10 లు సభ్యత్వచందా దేవర వార్లకు మనియార్డరుచేసినాను.

(2) ఈ గ్రంథమాలలో సభ్యులుగా చేరుటకు అనుకూలమైన మహనీయులు నాయెరుకలో ౫,౬ గురు వున్నారు. వారితో సంప్రతించి సభ్యులుగా చేర్పించుటకు యత్నించెదను.

(3) శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాజావారితరపుఉద్యోగస్థులు యీవరకు ఒకటిరెండుసార్లు శ్రీపాంచరాత్రాగమగ్రంథములు సంహితలు శ్రీవిజయనగరం సంస్కృతకాలేజీలైబ్రరీలో చేర్చుటకు ముఖ్యమయిన వుద్దేశ్యమున్నట్టుల నాతో సంప్రదించినారు. కానయికముందు వారితో మీటుఅయి - యీగ్రంథమాలవిషయంలో మనవిచేసి శాశ్వతపోషకులుగా చేరుటకు ప్రయత్నం చేసెదను. కార్యసానుకూలం అగుటకు ఆ శ్రీరామచంద్రుడే కర్త.

(4) శ్రీ సింహాద్రినాథునిసన్నిధిని, సాత్త్వత భారద్వాజసంహితలు రెండున్ను, నిత్యార్చనవిషయంలో ఉపయోగపడుచున్నవి. ఉత్సవములు సాత్వతసంహితప్రకారం జరుగుచున్నవి. కర్షణాది ప్రతిష్ఠాంతం ప్రయోగము సంపాదించి యొకప్రతి వ్రాయించి సాధ్యమైనంతవేగములో పంపెదను.

(5) విష్ణుపద్మ కపింజలసంహితలతాలూకు గ్రంధము సంపుటీకరణముజేసి, కర్షణాది ప్రతిష్ఠాంతం కొన్ని స్థలములలో ఆరాధన జరుగుచున్నది. అట్టి గ్రంథంకూడా సాధ్యమైనంత వేగములో జాగ్రత్తచేసి పంపుకొనెదను.

* * * *

శ్రీ కపింజలసంహితతోగూడా తాము కటాక్షించే జబాబు కొరకు యెదురుచూస్తూ యుంటాను. అనేక సేవింపులు,

తిరువళ్యానకు తేవలెను.

---

XI

బ్రి॥ శ్రీ॥ కప్పగంతుల కృష్ణమూర్తిగారు, కళింగపట్టణం.

ది 6-1-31.

"......మీరు వ్రాయించిన ఉత్తరము చేరినది. తాము తలపెట్టిన యుత్తమకార్యవిషయములో ఉపబోధకర్తగా నేను తోడ్పడ

దను. ఈనెల 16 వ తేదీని కాశీవెళ్లుచున్నాను. నాప్రయాణములో యీప్రచారమే యుద్దేశించితిని.

ఇచ్చటగల శ్రీ యమ్. వి. నరసింహాచార్యులుగారితో (ప్రొప్రయిటరు, శ్రీ రామాహాస్పిటలు) యీవత్తున్న విశదపర్చితిని. కొన్ని గ్రంథములు వారివద్దగలవట. అన్నివిధములచేతను సహాయముచేయ నంగీకరించినారు. ఇట్టి మహత్కార్యముల నాభగవంతుడే సఫల పర్చుకొనును. నాశక్తియంతయు నీసంస్థయభివృద్ధికే వ్యయపరుతును.

నమస్కారములు, చిత్తగించవలెను.

## XII

శ్రీ శ్రీమాన్ తూప్పుల్ సుందరరాజయ్యంగారు,
మేనేజరు, శ్రీ వైష్ణవ గ్రంథరత్నాకరశాల, బళేపేట,
బెంగుళూరు, ది 7-5-30.

"......ఈ విషయములో నేను తమ కన్నివిధములచేతను సహాయపడగలను. ఇదివరలో గాయత్రీతంత్రము, మంత్రమాల పంపితిమి. ఈశ్వరసహింత..........వెంటనే పార్శెల్‌లో పంపుచున్నాను.

చి తగించేది.

## XIII

మ॥ రా॥ శ్రీ టి. వి. కుబేంద్రరాజుగారు,
ఫొటోగ్రాఫికుఆర్టిస్టు, దేవరాజ మొదలివీధి, మద్రాసు,
ది 11—1—31.

"...... ఇట్టిగొప్పవిషయంలో నావల్లఅయ్యేవిధంగా యెల్లప్పుడూ సహాయంచేయుదును.......ఇదివరలో అహిర్బుధ్న్యసంహిత పంపితిని. మిగతా పాంచరాత్రగ్రంథములకు వ్రాసియున్నాను. త్వరలోనే తీసి పంపగలను - ఇంతేదండములు."

## XIV

శ్రీ శ్రీమాన్ రాం॥ భ॥ పార్థసారథి ఆచార్యులుగారు.
శ్రీ వైఖానసపత్రికాఫీసు, 40, టంకసాలవీధి, మద్రాసు,

"మహాశయా ! ది 8—2—31.

తాము కటాక్షించిన శ్రీముఖము చేరినది......తాము సంకల్పించియున్న యీ మహత్కార్యము నా సర్వేశ్వరుడగు శ్రీరామచంద్రుడు తప్పక నెరవేర్పగలడు......తా ముద్దేశించినకార్యము యొక్క గౌరవమునుబట్టి యింతటికార్యము నాబోటివారలవలన సాధితమగునని నేను విశ్వసింపజాలకున్నాడను. ఇంతకున్ను తాము వెంటనే మద్రాసువచ్చేయెడల యిక్కడిపనుల నన్నింటిని దేవరవార్లు నేరులో వుండి చేసి పుచ్చుకొనుట కవకాశ ముండును......తప్పక తాము మద్రాసు దయచేయ ప్రార్థన......

దివ్యచిత్తానకు తేవలయును."

---

## XV

శ్రీ శ్రీమాన్ డాక్టరు డి. రంగాచార్యులుగారు, ఎడిటరు,
ప్రింటరు & పబ్లిషరు, శ్రీ వైఖానసగ్రంథమాల & పత్రిక,
టంకసాలవీధి, మద్రాసు, ది 9-2-31.

"మహాశయా! వందనములు.

తమకవ రుత్తర మంది సంగతులు తెలిసినవి. చాలాసంతసించితిని. తమ ప్రధానోద్దేశములను ఒకమారు పత్రికలో ప్రకటించుచున్నాము. తాము యిచ్చటకు విచ్చేసినయెడల తమకార్యములను ముందట వుండి పూర్తిచేయించుకొనుటకు నావలన అయినమట్టుకు కావలసిన సదుపాయము చేస్తాను...............అనేకదాసోహములు."

---

## XVI

శ్రీముఖము.

శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యోభయవేదాంతప్రవర్తక కాంతశమదమాద్యనంతకల్యాణగుణపరిపూర్ణులై శ్రీభగవద్రామా

నుజమునివిరచితతుస్సప్తసింహాసనాధ్యక్షపరిగణితు లై, శ్రీభాష్యకారభాగినేయ తత్పాదుకాయమానముదలియాండా నిత్యపర నామధేయక శ్రీదాశరథీ దివ్యవంశసుధాపయోనిధి రాకానిశాకాంతులగు శ్రీమాన్ కోయిల్ కందాడై అణ్ణన్ శ్రీ రంగాచార్యులు అయ్యవార్లంగారు,

కాంజీవరం, ది 3-2-31.

"దేవరవారు చాలాప్రయాసమును వహించి, శ్రీ సీతారామచంద్రుని కరుణనువహించి, దేవరవారు యీ...అందరికిన్ని అనుకూలంగా శ్రీ పాంచరాత్రగ్రంథములను పరిశీలనచేసి సర్వజనులకున్ను అనుకూలం చాయడం దాసునికిన్ని చాలా సంతోషకరంగా నున్నది. అగత్యంగా దీనిని ప్రచురంజేసి శ్రీరామచంద్రుని కటాక్షం వలన అవిత్వరలో పూర్తిచేయగలరు. దాసునికిన్ని పరమసంతోషంగాయున్నది. దానికి అనుకూలంగా దాసునితోటి అయినవరకు చేయగలను.

ఇంతే విన్నపములు,

దాసునియందు నితాంతం కృప యుంచగలరు."

---

## XVII

శ్రీ శ్రీమాన్ పరవస్తు గోవిందాచార్యస్వాములవారు,
శ్రీ వేదాంతవిద్వాన్ మహారాజాసంస్కృతకళాశాల, విజయనగరం,

ది 14-2-31.

"...... అనేకదండవత్ప్రణామము లాచరించిచేయు విజ్ఞాపన:—

దేవరవారు వ్రాయించిన ఉత్తరమందినది. ......ఈమహాత్కార్యవిషయములో... సంహితలకు ప్రూఫులు దిద్ది పంపగలను. వాని కుపోద్ఘాతటిప్పణ్యాదులనుజేర్చి పరిష్కరించెదను...ఇంకను నాశక్తివంచన లేక ప్రచారంచేసి కొందరు సభ్యులనుజేర్చ యత్నింతును. ..."

## XVIII

శ్రీ శ్రీమాన్ ఇరగవరపు వెంకటాచార్యులుగారు,
దేవస్థానం ఉద్యోగస్థులు, కొత్తవల్సపోస్టు, తున్మికాపల్లి అగ్రహారం.
"దాసోహములు. ది 13-4-31.

దేవరవార్లు పాంచరాత్రి కపింజలసంహిత ముద్రించినా రనిన్ని యింకా గ్రింథములు అచ్చు వేయించుచున్నారనిన్నీ తెలిసినది. మీరు చేయు సంస్థయొక్క అభివృద్ధిలో దాసుణ్ణి ఒకమెంబరుగా చేర్చుకోవలెనని కోరుచున్నాను.

---

## XIX

శ్రీ శ్రీమాన్ బి. యస్. రంగభట్టరువారు,
శ్రీ కర్ణాటకరాష్ట్రి అర్చకమహాజన సంఘాధ్యక్షులు,
తులసీవనం, బెంగుళూరుసిటి.
ది 12-4-31.

"...తాము విశ్వాసపూర్వకముగా పంపిన శ్రీముఖమును శిరసా వహించినాను .. తాము ప్రారంభము చేసివుండిన కార్యమునకు దాసుడు యథాశక్తి సహాయమొనరించుటకు సిద్ధముగానున్నాడను.
ఇంతే విజ్ఞాపనలు, విధేయుడు."

## XX

శ్రీమాన్ కొడవలగంటి వేంకటాచార్యులవారు,
కొత్తపట్టణం, గుంటూరుజిల్లా,
ది 10-4-31.

"దేవరవారు 2,3 సార్లున్ దాసునకు అత్యంతకృపతో వ్రాసిన వుత్తరములు......వగయిరాలు చేరినవి. తీరిక లేకయిన్నిమార్లు శ్రమ కలుగజేసినందులకు క్షమింపవేడుచున్నాను. దాసుణ్ణి దేవరవారు యేర్పాటుజేసిన ఈ శ్రీపాంచరాత్రాగమసర్వస్వనిర్వహణ విషయమై కార్యాలోచనా సభ్యత్వ సామాన్య సభ్యత్వములలో నియమించి

అత్యంతకృపతోటి తన్మూలమైన గౌరవపత్రికనుగూడ కృపజేసియున్నారు....ఇచట వైశాఖ శు॥ ౧౩ ఆదివారం కేశవస్వామి బ్రహ్మోత్సవము......దేవరవార్లు అవశ్యం ఒకపర్యాయము వేంచేసి సేవ సాయించవలెనని దాసుడు మిక్కిలి పౌనఃపున్యముగా ప్రార్థిస్తూయున్నాను. ...శ్రీమాన్ రామానుజాచార్యులగారివల్ల విన్నంతమాత్రంచేతనే ఇట్టి కృపావేశంగలిగినందులకు దేవరవారిని యెప్పుడెప్పుడు చూతామా అను అభిలాష విశేషముగా యుంటున్నది. స్నేహబంధు ర్నకదాచ దూరః- అనుసటుల యోజించి అవశ్యంగా వేంచేసి స్నేవసాయించవలసినది.—

దాసోహములు."

## XXI

"From,

OFFICE OF THE BOARD OF COMMISSIONERS,
For Hindu Religious Endowments,
RAYAPETTAH, MADRAS.

D. 6 No. 11122 B. T. 7—5—31.

Dear Sir, Ref .. your letter dated 7-4-31.

I sympathise with the object of your Sabha and publications and I wish them very success.

You are probably aware that at present a number of archakas and trustees of temples in the Northern Circar Districts, have filed suits against the Board questioning its jurisdiction over them. Hence it is not possible for me now to speak to them about your publications and your Sabha. You may however approach them directly, and I have no doubt you will meet with a hearty response from them.

*Yours Sincerely,*

(Sd.) N. SREENIVASACHARYULU."

## XXII

మ॥ రా॥ శ్రీ తూము సీతారామయ్యగారు,
(Retired) హెడ్ ఎక్కౌంటెంటు & ఏజన్సీ ప్లీడరు, భద్రాచలం,
ది 11-5-31

సీ॥ భగవత్కటాక్ష సం♦ప్రాప్తి సౌలభ్యైక
సన్మార్గదర్శి వై♦ష్ణవమతంబు
మహితమాయావాద♦మత్తేభభయదకే
సరిసదృశంబు వై♦ష్ణవమతంబు
ఆసేతుకహిమాచ♦లాంతదేశస్థస
జ్జనసేవితంబు వై♦ష్ణవమతంబు
చిదచిదీశ్వరభేద ♦ సదమలతత్వార్థ
సంధాయకంబు వై♦ష్ణవమతంబు
గీ॥ ఇట్టి భాస్వన్మహామత ♦ మిపుడు కాల
వైపరీత్యంబు కతన ని♦ర్భాగ్యదశను
బొంది విష్ణ్వాలయపుమూల♦మూలలందు
నడగియుండెగదా విధి ♦ గడప వశమె?

ఉ॥ పండితు లందు నందు దన♦రారుచునుండియు, వారు స్వోదరో
ద్దండ పరత్వులై పరహి♦తంబుల జేయగనొల్ల రట్టివా
రుండిన నేమిలాభము మ♦హోగ్రతరాపద లోర్చి భాష్యకా
రుం డపు డీమతంబు బహు♦రూఢికి దెచ్చె జగద్ధితార్థమై.

మ॥ దనుజధ్వంసి స్వయంబుగా దెలిపె ము♦న్దా బాంచరాత్రాగమం
బనుపేరన్ సకలప్రపంచరచన ♦ వ్యాపారరక్షావినా
శనకార్యక్రియమున్, ముముక్షుజనమో♦క్షప్రాప్తిమార్గంబు త
ద్ఘనశాస్త్రంబెగదా ప్రమాణము మహో♦ద్యద్వైష్ణవశ్రేణికిన్.

ఉ॥ ఆమహితాగమంబు జగమం దడు♦గంటుచు నుండ గాంచి యెం
తో మది గుంది సజ్జనులు ♦ దోడ్పడ నాశ్రితు లుద్ధరించి ము
ద్రాముఖమందు సచ్చుపడి ♦ ధారణి బర్వగజేయ నీ బుధ
గ్రామణి సేయుయత్నము తి♦రంబగు సత్ఫలమిచ్చు గావుతన్.

శా॥ ధీరుండున్ బొడిచేటి వంశభవుఁడున్ ♦ ధీనిర్మలాత్ముండు, సీ
తారామానుజనామ వైష్ణవకులో♦ద్యద్ధర్మశీలుండు, తా
నారూఢంబుగ బాంచరాత్రనిగమం ♦ బాసక్తి ముద్రించు గా
ర్యారంభం బొనరించె నీపనికి దో♦డ్పై యుండరే సద్బుధుల్.

ఇట్లు విధేయుఁడు,

తూము సీతారామదాసుఁడు.

## XXIII

శ్రీ శ్రీమాన్ వేదాంతం శ్రీనివాసాచార్యులుగారు,
అర్చకపత్రికాధిపతులు, బెజవాడ, ది 11-5-31.

మహాశయా !

తాము దయతో ననుగ్రహించిన శ్రీపాంచరాత్రాగమశాస్త్ర సర్వస్వసంబంధితములగు నిబంధనపత్రములున్ను శ్రీముఖములున్ను ఆశ్చ యమందానందమును జేర్చినవి......పరమపవిత్రమగు తమ యుద్యమముపై నాకు సంపూర్ణాభిమానము గలదు. తాము అసామాన్యమైన మహాకార్యనిర్వహణమునకు సర్వదా పాటుబడుచున్నారు. ప్రతిమనుష్యమాత్రుడును తమకుదోడ్పడుట విధాయక ధర్మమై యున్నది. అట్టియెడ జగత్కల్యాణసంధాయియగు శ్రీ సీతారామచంద్రమూర్తి తన దివ్యసంకల్పమగు శ్రీపాంచరాత్రాగమ శాస్త్రోద్ధరణకార్యభారమును దమపై నిడెనని నేను విశ్వసించుచు తాము నాకు నియోగించిన ధర్మమును నిర్వహించుటకు సంసిద్ధుడనుగా నున్నానని విన్నవించుచున్నాను......అర్చకపత్రికను యీ నెలనుండి తమ కుచితముగా నంపుచుందును. తమ ప్రకటనలను వ్యాసములను మా పత్రికలో ప్రకటింపగలను.

భవత్కృపాభిలాషి,"

## XXIV

### శ్రీ వైష్ణవ పత్రిక (పెంటపాడు)

ప్రజోత్పత్తి సం॥ర వైశాఖమాస సంచిక, మొదటి పేజి.

"తూర్పు గోదావరిజిల్లా భద్రాచలమునందు పొడిచేటి సీతా రామాచార్యులవారు పాంచరాత్రాగమశాస్త్రమును ముద్రించుటకు చేసిన ప్రకటను స్థలాంతరమందు ముద్రించియున్నాము. కావ, దానినిజూచి భాగవతోత్తములందరు సాయపడ వేడుచున్నాము.

ఇట్లు,
పత్రికాధిపతి."

## XXV

### శ్రీవైఖానసపత్రిక (ఈగావారిపాళెం)

ప్రమోదూత సం॥ర ఫాల్గుణమాససంచిక, మొదటిపుట.

### శ్రీ పాంచరాత్రాగమసర్వస్వము.

"పైపేరిట తూర్పుగోదావరి జిల్లా భద్రాచల నివాసులగు శ్రీమాన్ పొడిచేటి సీతారామాచార్యులుగారు భద్రాచలమం దొక మహత్కార్యము నారంభించినట్లు వ్రాయుచున్నారు. ఆచార్యుల వారి శక్తిసామర్థ్యములు ప్రశంసించదగినవి. విద్య దరిద్ర దశయందు వచ్చుచున్న యీ కాలమందు ప్రాచీనధర్మములను శాస్త్రములను బాగుచేయవలెనను ఈ యుద్యమమెంతయు నానందదాయకమై యున్నది.

భారతభూమియందలి మతకర్తల మనసంతయు నతీంద్రియ మగు ధర్మమందే లయించినది. మనము కేవల ప్రత్యక్షప్రమాణ్యా వాదులముమాత్రమే కానంతవరకు ఆలయములు మనకుపాధేయము లే.

ఇట్టి ఆలయధర్మంబుల నుపదేశించుట కేర్పడిన వివిధశాస్త్ర ములలో వైష్ణవధర్మశాస్త్రములలో నొక్కటియగు శ్రీపాంచరాత్రము ఛాలవరకు జనసామాన్యమునకు తెలియక మరుగుపడి యున్నదనుట

విదితము. ఈ శాస్త్రమునందలి గ్రంథములు పెక్కులు గలవు. వీని నెరుంగకుండుట వాఙ్మయము నెరుంగగోరువారలకు లోపమేయగును. తప్పక ఆస్తికులు పరిశోధకులు నిందుకు సాయపడ గోరుచున్నాము.

శ్రీ యాచార్యులవారి కృషికి మా సంపూర్ణసానుభూతి నెఱింగించుచు ఈ మహాత్కార్యము శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్పరివార సమేతుడగు శ్రీరామచంద్రమహాప్రభుని కటాక్షముచే నిర్విఘ్నముగ నెరవేరుటకును ప్రార్థించుచున్నాము."

---

## XXVI

శ్రీమాన్ డాక్టరు డి. రంగాచార్యులుగారు, ఏ.యం., ఏ.సి., (భిషగ్వర) ది ఆంధ్రా ఆయుర్వేదిక్ ఫార్మసీ, లిమిటెడ్, మద్రాసు.

అయ్యా! తాము దయతో మాకార్యాలయమునకు విమర్శనార్థము పంపించిన "శ్రీకపింజలసంహితా" గ్రంథమును కృతజ్ఞతతో స్వీకరించితిమి. తమయుద్యమమును మేము హృదయపూర్వకముగ బ్రశంసించుచున్నాము. ఈయుద్యమము శ్రీవైష్ణవసిద్ధాన్తవ్యాప్తికి పునాదియగుటచే శ్రీవైష్ణవసామాన్యమంతయు మీయుద్యమమునకు తప్పక పాటుబడగలరని నమ్ముచున్నాము. గ్రంథము చాలాముచ్చటగానున్నది. ఈయుద్యమము క్రమాభివృద్ధిజెంది పాంచరాత్రసంహితలన్నియు నీగ్రంథమాలయందు ప్రచురింపబడుటకై శ్రీరామచంద్రమూర్తి యనుగ్రహించుగాక యని కోరుచున్నాము.

శ్రీమద్వైయ్యాకరణపంచానన రొంపిచర్ల భట్టర్ పార్థసారథి అయ్యంగార్లవారు (ఆకులమన్నాడు) కూడా మాయభిప్రాయముతో నేకీభవించినట్లు విజ్ఞాపనము చేయుమనిరి.

| | |
|---|---|
| 401, టంకసాలవీధి, | దివ్యతిరువళ్ళ్యమునకు తేవలెను. |
| జి.టి. మదరాసు, | డి. రంగాచార్యులు, |
| 15—5—31. | శ్రీవైఖానస ప్రతికాధిపతులు. |

షరా:— మిగిలినయభిప్రాయములు ముందు ముద్రింపబడును.

—సంపాదకులు.

శ్రీమతే రామానుజాయ నమః.

# ఉపోద్ఘాతః.



శ్రీమన్నారాయణ స్సకలజగత్కారణమితి సకలశ్రుతిస్మృతీతిహాసపురాణతాత్పర్యమ్. శ్రుతీనాం సర్వాసామపి దేవతాప్రార్థన తదారాధనరూపయా ప్రకృతి తదవాంతరభేదప్రతిపాదకత్వం విద్వాంస ఆచక్షతే. యాగాది ప్రతిపాదకో భాగః పూర్వభాగ ఇతి తత్త్వప్రతిపాదకో భాగ ఉత్తరభాగఇతిచ కథ్యతే. తత్తద్దేవతానాం భిన్నభిన్నతయా ధికమహిమశాలితయా చావగమేపి, సర్వేషాం సర్వాధికత్వానుపపత్త్యా వ్యాఘాతాది పరిహారార్థ ముపపత్త్యర్థంచ సర్వైరపి విమర్శనై రేకేశ్వరవాదః తత్తద్వాక్యసమన్వయ సూక్ష్మేక్షికయా శ్రీయతే. వాక్యార్థసమ్యగ్జ్ఞప్తిరూపక్తై స్త్రయ్యంతనిష్ఠాతై ర్భగవాన్నారాయణఏవ, సర్వాంతర్యామీ సర్వేశ్వరఇతి సకలదేవానాం మహత్త్వమపి తన్మహాత్మ్యాంతర్భూత ముపపద్యతఇతి వర్ణ్యతే. సర్వాసూపనిషత్సు పురాణేషుచ నారాయణఏవ పర ఇత్యనన్యపర వాక్యస్వారస్యసిద్ధమితి, దేవతాంతర్యపారమ్యబోధక కతిపయవాక్యానాం వేదాంతేష్వవగమేపి తేషా మన్యపరత్వేన నారాయణపరత్వవాదం ప్రతి నవిరోధఇతిచ వర్ణయన్తి. అన్యేచదేవా ఆధికారికా భగవన్నియామ్యాఇతి తచ్ఛరీరత్వేనైవ తేషాం తాదృశమహిమశాలిత్వమితి. దేవతాంతరారాధనమపి భగవదారాధనఏవ పర్యవస్యతీతి చోచ్యతే. "అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ." "యేప్యన్యదేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః తేపి మామేవకౌంతేయ యజన్త్యవిధిపూర్వకం" "సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" ఇత్యాదీనిహి వచాంసి యజదేవపూజాదిష్వితి ధాతుపార ప్రతిపాదిత దిశా యజధాతో ర్నిష్పన్నో యాగశబ్దో దేవపూజా మాచష్టే దేవానాం మహిమాతిశయశాలిత్వం స్వస్యా ల్పశక్తిత్వంచ సమాలోచ్య ప్రార్థనాదిభిః ప్రీతై స్స్వతోదయాది గుణమహితై ర్దేవై రాత్మరక్షణ మభిప్రేత్య ప్రార్థనతదుద్దేశ్యకాగ్నిహవిః ప్రక్షేపాదినా తదారాధనం మనుజైః క్రియతే. అగ్నౌ ప్రక్షిప్తాః ఆహుతీ స్తే స్వీకృత్య

తృప్యంతీతిచ భావ్యతే. దేవానాం విగ్రహాద్యభావః కైశ్చిదుచ్యతే. అన్యైతు దేవానామపి విగ్రహాదియోగో స్తీతి వదన్తి. "ఇంద్రోహవై దేవానాం విరోచనో సురాణాం...తౌహ సమిత్పాణి" "తేనేంద్రో వజ్రముదయచ్ఛత్" "వజ్రహస్తః పురందరః" ఇత్యాదిర్హి శ్రూయతే. అనేకయజ్ఞేషు యుగపత్సన్నిధాయారాధ్యమానత్వం దేవానాం విలక్షణమహిమశాలితయా నవిరుద్ధమితి కేచిదాహుః. అపరేతు సౌభరివ దనేకశరీరపరిగ్రహేణోపపద్యత ఇత్యాహుః.

కూర్చాదిషు దేవతానా మావాహనం

విసదృశేషు సాలగ్రామాదిషు హర్యాదిభావనం ఆసనపాద్యాచమనీయా ద్యుపచారకరణంచ భక్తై రాచర్యతే. తాత్కాలికతయా చిరావస్థాయిత్వేనచ తాదృశదైవసాన్నిధ్యం తత్రతత్రభావ్యతే. "ఆద్యయావాహయే ద్దేవ మృచాతు పురుషోత్తమ" మిత్యాదిభిః పురుషసూక్తమంత్రై శ్శౌనకాదిభిరన్యై రన్యైశ్చ మంత్రై స్తత్తద్దేవోపచారాది కరణముచ్యతే.

రాజాదీనాం కాలాంతరదేశాంతర వర్తిత్వేపి తత్ప్రతినిధిభ్యః కరప్రదానపూజాదిభి రాజాది ప్రీత్యుత్ప త్తివ త్ప్రతినిధియంత్ర ప్రతిమాదిపూజా దేవప్రీతిం సంభావ్యశ్రద్ధయా చర్యతే భక్తైః.

నారాయణస్య సర్వాంతరత్వం సర్వాధికత్వం సర్వకర్మసమారాధ్యత్వం సర్వఫలప్రదత్వం చాకలయ్య తదుపబృంహణయా తత్స్మృతి పురాణాగమాదీంశ్చ సమ్య గనుసంధాయ వేదేషు స్వర్గ పుత్ర పశ్వన్నాదిఫలాంతర ప్రాపక దేవతాంతర సమారాధనాదే స్సకలాధికారి సముజ్జీవనపరత్వ రూపవాత్సల్య గుణప్రయుక్తారాధనాంతరోపదేశాదే శ్శ్రవణేపి తత్వబోధనస్యాపి తస్మాదేవావగమేన సర్వాంతరం నారాయణమేవ సకలఫలప్రాప్త్యర్థ మంతతో మోక్షప్రాప్త్యర్థంచ కేచిదుపాసతఇతి తేపరమైకాంతిన ఇత్యుచ్యన్తే. ఇతరదేవారాధనేపి తదంతర్యామిణో భగవతఏవారాధనం మన్యంతే. నిత్యనైమిత్తిక కామ్యరూపకర్మారాధ్యత్వమివ వేదేషు ఫలసంగరహిత మోక్షైకప్రయోజన కేవలభగవన్ముఖోల్లాసకరకర్మాఖ్య కైంకర్యారాధ్యత్వరూపవిశేషోపి ప్రతిపాద్యతే. ఏవం భగవత స్సకలదేవాంత

రత్వవత్సకలవస్త్వంతరత్వేన శిలాదిశరీరద్వారాపి భగవత ఆరాధ్యమానత్వే, న కాచిదప్యనుపపత్తిః. వేదేష్వర్చావిగ్రహప్రశంసా నాస్తీత్యపి శంకా నరమణీయా. వేదేషు తద్బోధకప్రమాణానా ముపలంభాత్. (ఋక్ 2-2-25-6. ఛాందోగ్య 1-6-6. అంతర్యామి బ్రాహ్మణ, పురుషసూక్తోత్తరనారాయణ. బృహదారణ్యకా ౪-౩-౬. ముండక 3-1-3, 3-2-3. ఇత్యాదిషు, భగవతోవిగ్రహయోగః ప్రతిపాదితః. వాజసనేయసంహితా 25-10 to 14, ఋగ్వేదే. 5-6-8, 2-2-26, 2-2-25, 2-2-24, 8-8-13, 1-3. యజుషి బ్రాహ్మణే 2-4-3. ఇత్యాది ష్వర్చావిగ్రహస్యచ ప్రతీతి రుపపద్యతే.)

సర్వాంతర్యామిణో భగవతః. శిలాది భక్తాభిమతశరీరవిశేషవత్త్వా భావఇతి శంకానకయాచిదపి విధయా ఉపపత్తిమతీభవిష్యతి. విలక్షణ సంబంధస్యైవ శరీరవ్యవహార ప్రయోజకతయా తాదృశసంబంధ స్యార్చామూర్త్యాదిష్వపి సత్వాత్.

పరవ్యూహవిభ నాంతర్యామ్యర్చావతారరూపభేదాః భగవతః సలోకదృష్టానుపపత్తి లేశైః ప్రతిక్షేప్యాభవన్తి అతః కుత్రచిన్మూర్తౌ భగవత్సాన్నిధ్యం ప్రదేశాంతరేష్వవర్తమానత్వం నావగమయతి, భగవతః ప్రతిమానాస్తీత్యాది వాదాశ్చ సాదృశ్యాభావపరాః నవిగ్రహాభావపరాః శరీరాభావవాదాశ్చ కర్మకృతశరీరాభావపరాః నతుశరీరమాత్రా భావపరాః. భగవతశ్శరీరవత్వబోధకబహుశ్రుతివిరోధాత్. అతోభగవతఅర్చావతారవిషయే నకాచి దనుపపత్తిః. ఇయాంస్తు విశేషః దేవతాంతరాణాం ప్రతినిధిన్యాయేనప్రతిమాయంత్రాదిపూజా. భగవతస్తు సర్వాంతరత్వేన సర్వశరీరత్వేనచ తాదృశశరీరాంతర్యామి సాక్షాదారాధ్యతే.

కృష్ణాది విభవవిగ్రహే యద్యపి స్థూలదృష్ట్యా ప్రతినిధిన్యాయ ఉపపద్యతే తథాపి కృష్ణత్వదాశరథిత్వాదీనా ముపాధీనాంభగవచ్ఛరీరత్వవత్ శిలాదిశరీరత్వమపి భగవతో నానుపపన్నమితి శరీరశరీరభావేనైవ భగవత ఆరాధ్యమానత్వ ముపపద్యతే.

కేచిత్త్వాహుః - వేదేషు యాగాదిసంస్కారాః మంత్రైః ప్రతిపాద్యన్తే. కుత్రచిద్గార్హ్యాణి కర్మాణిచ. తథైవాపస్తంబాదిభిః శ్రౌత

గృహ్యాదిసూత్రాణి తత్తన్మంత్రవినియోగప్రదర్శకాని ప్రణీతాని భగవద్విగ్రహాద్యారాధనోపయోగితయా ప్రసిద్ధి ర్వేదమంత్రాణాం నదృశ్యతే. వేదమంత్రైరేవ క్రియమాణాని కర్మాణి సర్వైరపి పరిగ్రాహ్యాణీతి అపరేత్వేవం సమాదధతే. సర్వవిధాన్యపి కర్మాణి వేదమంత్రమూలాన్యేవ. తేషాం మంత్రాణాం వినియోగ ప్రకారస్తు తై స్తైర్మంత్రై రనేకధాన్యై ర్మహర్షిభిః క్రియతే. వేదేసర్వవిధాధికారిపరిగ్రహార్థం పశుపుత్రాదిఫలకర్మప్రతిపాదకమంత్రాది బాహుళ్యేపి వేదాంతేషు బ్రహ్మ తదుపాసనవిశేషప్రకార ప్రతిపాదకభాగాఅల్పతీయాపి ననసంతీతి వక్తుం శక్యతే. ఏవం భగవదర్చావిగ్రహాది ప్రతిపాదక మంత్రా వేదేషూపలభ్య స్తఏవ. శౌనకాదిభి స్తద్వినియోగప్రకారః కథితః. ఏకాయనశాఖా భగవదర్చామూర్త్యాదిప్రతిపాదనపరా. ఏకాయనశాఖాయాశ్చ వేదత్వం కాశ్మీరాగమప్రామాణ్యాదిషు ప్రపంచితమితి నేహప్రతన్యతే. (న్యాయపరిశుద్ధౌ) ఏకాయనభాగస్య ఛాందోగ్య భూమవిద్యాయాం (7-1-2) ఏకాయనం వేదవిద్యామిత్యాదినోల్లిఖితస్య వేదాత్పార్షక్యం నాశంకనీయం. బ్రహ్మవిద్యాపదవివక్షితోపనిషద్భాగస్యాపివేద బహిర్భావప్రసంగాత్.

మహాభారతకాలోత్తరాది వచనై రేకాయనశబ్దస్య వేదశాఖాపరత్వావగమాత్ సర్వజ్ఞ స్సర్వదర్శీత్యాదివాక్యానాంపరాశర బాదరాయణాదిభిః (విష్ణుపురాణే, 6-5-76 to 79) (భారత ఉద్యోగే 68-17-18) నఉపబృంహితత్వా చ్చైకాయనశాఖాయా వేదత్వ మవివాదం. ఏతేన శివార్కమణిదీపికాయా మప్ప దీక్షితేన కృతా తస్యా వేదత్వాశంకాపి నిరస్తా వేదితవ్యా. పాంచరాత్ర మిదం వేదోపబృంహణం. వేదార్థోయథా బ్రాహ్మణై రుపబృంహ్యతే తథాపురాణై రుపబృంహ్యతే. ఉపబృంహణంహినామ విదిత సకలవేదతదర్థానాం స్వయోగమహిమసాక్షా త్కృత వేద తత్వార్థానాం వాక్యై స్స్వవగిత వేదార్థవ్యక్తీకరణం. సకలశాఖాగతస్య వాక్యార్థ స్యాల్పభాగశ్రవణా ద్దురవగమత్వేన తేన వినా నిశ్చయా యోగా దుపబృంహణం కార్యమేవ. (శ్రీభాష్యపురాణఘట్టే) వేదవిహితసంస్కారేషు పుత్రపశ్వన్నస్వర్గాది కామ్యఫలవంతి కర్మా

ణ్యనాదృత్య నిత్యాని మోక్షోపయోగానిచ భగవదారాధనాదీని కానిచిత్కర్మాణ్యేకాంతిభి రాచరణీయాణీ త్యుపపత్తిసిద్ధాని. పురాణాని ధర్మశాస్త్రాణిచ విశేషేణ సకలఫలసాధనోపదేశక వేదోపబృంహణరూపాణి. తత్వప్రతిపాదక వేదాంతోపబృంహణరూపాణిచ. తథా పాంచరాత్రాగమోపి తత్వప్రతిపాదకోపనిషదంశ నిత్యాది భగవదారాధనరూప కర్మప్రతిపాదక వేదభాగ విశేషోపబృంహణ రూపః. ధర్మశాస్త్రేషు యథాకర్మాదీతి కర్తవ్యతాస్వరూపం తత్తత్ఫలానుగుణ్యేన వివిచ్య నిర్ణీయతే తథా వాసుదేవారాధనోపయోగి మోక్షఫలకం కర్మస్వరూపాదికం పాంచరాత్రశాస్త్రేణోపబృంహ్యతే విష్ణుపురాణభారతవరాహకూర్మపురాణాదిషు పాంచరాత్రీయకతిపయవిషయోపబృంహక కతిపయశ్లోకసద్భావేపి విశేషాకారేణ సమ్యగ్బోధనార్థం పాంచరాత్రాగమరూపేణాస్య శాస్త్రస్య సార్థక్య ముపపన్నం.

వేదోప బృంహణతయైవ త్రైస్తై ర్వాదిభి రభిధీయమానేషు నానావిధేషు దర్శనేషు కస్యదర్శనస్యోపాదేయత్వం కస్యనేత్యాశంకాయాం. యస్య యుక్తిప్రమాణసత్పరిగ్రహాది సమీచీనత్వం తస్యైవ పరిగ్రాహ్యత్వం, అన్యస్య నేతి సువచం. వేదాంతసూత్రేషు ద్వితీయాధ్యాయ ద్వితీయపాదే వేదవిరుద్ధానాం బహూనాం దర్శనానా మపరిగ్రాహ్యత్వ ముపవర్ణితం. తత్రాంతే పాంచరాత్రాగమస్య దోషాభావేన పరిగ్రాహ్యత్వ ముక్తం. యత్తు కైశ్చిత్పాంచరాత్రస్యాపి నిరాస స్సూత్రకారాభిమతఇతి వర్ణితం, తదసంగతం. సూత్రకారా నభిమతి గమకహేత్వభావాత్. చతుర్షువేదేషు నిష్ఠా మలభమాన శ్శాండిల్య ఇదంశాస్త్ర మధీతవానితి వేదనిందాప్రతీయతఇతి యదభిహితం తన్నసమీచీనం. ఇదం న వేదనిందాపరం. అపితు పాంచరాత్రశాస్త్రశ స్త్యపరం. నహి నిందానింద్యం నిందితుం ప్రవర్తతే. అపితు నిందితాదితరత్ప్రశంసితుమితి హి, న్యాయవిదః. యత్తు సంకర్షణోనామ జీవో జాయతఇతి జీవోత్పత్తిః పాంచరాత్రతంత్రే ఉచ్యతఇతి తదపి న. జీవోత్పత్త్యుక్తే శ్శరీరసంయోగాభిప్రాయకత్వాత్. యథా వేదేషు ప్రజాపతిః ప్రజాఅసృజత, యతోవా ఇమాని భూతాని

జాయన్తే (తైత్తి.) ఇత్యాదిషు జీవోత్పత్తిః. తథాత్రాపి పాంచ
రాత్రేఽపి జీవోత్పత్తి ర్నిషిధ్యత ఏవ. ఏతస్మాజ్జాయతే ప్రాణో మన
స్సర్వేంద్రియాణిచ. ఇతి పరమాత్మనో మన ఉత్పత్తి ప్రతిపాదక
శ్రుత్యా సంకర్షణా త్ప్రద్యుమ్నసంజ్ఞం మనో జాయతే ఇత్యేత ద్విరు
ధ్యత ఇతిచేత్ న సంకర్షణపరమాత్మనో రైక్యాత్, భేదాభావాత్.
యత్తు జ్ఞానాదీనాం గుణిత్వవర్ణనం పాంచరాత్రేఽస్తీతి తదపి నహృద
యంగమం. సత్యం జ్ఞానమనంతం బ్రహ్మేతివత్తాదృశసామానాధికరణ్య
ప్రయోగాదేః పరమాత్మనో జ్ఞానప్రధానత్వాభిప్రాయేణోపపత్తేః.
తంత్రాంతరేషు వేదవిరుద్ధప్రక్రియా విద్యతే. పాంచరాత్రేతు వేద
విరుద్ధ ప్రక్రియానాస్తీత్యుచ్యతే. పాంచరాత్రే వేదరుద్ధప్రక్రి
యాస్తీతి పరై ర్యదాశంక్యతే త న్నసమీచీన మితి. తత్పరిహార
ఉపవర్ణ్యతే సమర్థ్యతేచ వేదావిరోధః పాంచరాత్ర ప్రామాణ్య
వాదిభిః. నహి తంత్రాంతరే ష్వేవం వేదవిరుద్ధప్రక్రియానాస్తీతి
సాధ్యతే, త్తైస్తైర్వాదిభిః అసూయాళవః కేచిత్తు భ్రాంతాఃపాంచ
రాత్రతంత్రేఽపి వేదవిరుద్ధప్రక్రియాస్తీతి ఆక్షేపపురస్సరం అస
దేవాప్రామాణ్యం వర్ణయంతి నతావతా కాచిదపి క్షతిః. పాంచ
రాత్ర తంత్రప్రామాణ్యస్య వేదావిరుద్ధత్వేన వక్తృదోషరహిత
తయా పురాణాద్యాదృతత్వేన సత్పరిగ్రహేణచ పాంచరాత్రం సర్వా
దరణీయతాం విశేషేణ భజతే. పాంచరాత్రశాస్త్రం వేదవైదికరాపౌ
ణికసకల తంత్రాభ్యర్హిత విశేషాంశప్రతిపాదకం. సకలదేశవర్తిసకల
విధనారాయణార్చావతారారాధనా ద్యుపయోగితయానాది శిష్ట
దృతం ప్రథతే. ఈశ్వరసంహితాయాం వింశాధ్యాయే విష్ణుక్షేత్రా
ణ్యనేకా న్యుపవర్ణితాని తత్రసర్వత్రాపి పాంచరాత్రాగమోక్తేనైవ
విధినా భగవదారాధనం చిరాదపి నిరవర్త్యతేతి సంభావనాయాం
నకాచి దనుపపత్తిః. ఇదానీం ఉత్తరభారతే బహవః ఆలయా ఉత్ప
న్నాః. తత్రతత్ర తదారాధనాది ప్రకారశ్చ తంత్రాంతర సంకీర్ణోఽస్తు
ప్రాయశ్చ చైతన్యరామానందవల్లభాది సంప్రదాయా స్సర్వేఽపి వైష్ణ
వపారమ్యప్రకారాంగీకర్తృ మతవిశేషా స్తంత్రాంతరసంకీర్ణపాంచరా
త్రాంశయుక్తా ఏవ భగవదారాధనాద్యంశే ప్రతిపత్త్యాదిష్వితి సంభా

వ్య తే. దక్షిణభారతే మాధ్వమతస్థా అపి పాంచరాత్రాను సారిణ ఏవే త్యవగమ్య తే.

యేతు రామానుజీయా స్తే చిరా త్పాంచరాత్రప్రామాణ్యం స్వమతప్రధానాంశం అనుపాలయంతో దేవాలయాదీ౯ దక్షిణభారతాంతర్వర్తిన స్సదాచారేణానూచానేన చిరాత్సంరక్షంతో విశేషేణ నిరవద్య పాంచరాత్రావినాశ సంప్రదర్శన బద్ధాదరాః ప్రథన్తే. ఈశ్వరసంహితాయాం "సాత్వతం పౌష్కరంచైవ జయాఖ్యంచ తథై వచ" (1-64) ఏతత్తంత్రత్రయోక్తేన విధినా యాదవాచలే శ్రీరంగే హ స్తిశైలేచ క్రమాత్సంపూజ్యతేహరిః (1-67). ఇతిప్రధాన వైష్ణ వక్షేత్రాణి రామానుజీయ పరిగ్రహవంతి పాంచరాత్రప్రక్రియా సిద్ధార్చనాక్రమవంతిచ భవంతి. వైఖానసాఖ్యం తంత్రాంతరం చిరాదాలయనిర్మాణపూజాది ష్వాపయుజ్యమాన మాలోక్య తే. దక్షిణభారతేచ బహావ ఆలయా వైఖానసప్రక్రియయా సంచాల్యంతే. పరంతు వైఖానసతంత్రోల్లేఖః వేదాంతదేశికాత్ప్రాచీనగ్రంథేషు నోపలభ్య తే. పురాణేషు వేదాంతసూత్రేషు ఆగమప్రామాణ్య శ్రీ భాష్యాదిషు పాంచరాత్రసముల్లేఖఏవ దృశ్య తే. మహాభారతే (నిర్ణయసాగర ముద్రాలయముద్రితే) శాంతిపర్వణి. (342-1 to 35, 343-27 to 45 344-5 to 66, 347-348- 349-358) అధ్యాయేషు మోక్షధర్మే అశ్వమేధపర్వణిచ వరాహపురాణే కూర్మపురాణే విష్ణుధర్మోత్తరేచ పాంచరాత్రసముల్లేఖో దృశ్య తే.

ఈశ్వరసంహితాయాం ఆద్యో భాగవతధర్మ ఇతి (1-26). తత స్సాత్వత పౌష్కరజయాది భేదాఇతి (1-50) ప్రథమం సాత్వతం శాస్త్రం (1-53). ఏతత్తు త్రివిధం విద్ధి సాత్వికాదిప్రభేదతః (1-57) స్వవికల్పా త్ప్రణీతంతు తత్సర్వం రాజసంస్మృతం తత్సాన్య ద్ద్వేధా పంచరాత్ర వైఖానస విభేదతః (1-62). ఇత్యాద్యుక్తం అనేన వైఖానస మపి పాంచరాత్ర మిత్యేవ పూర్వం వ్యవహ్రియమాణ మాసీదితి విజ్ఞాయ తే. అష్టోత్తరశత పాంచరాత్రసంహితాసు వైఖానససంహితాప్యేకా కథితా. (కుత్రచిత్తు వైహాయసనామాస్తి). వైఖానసస్య పాంచరాత్రస్యచ తత్వవిషయే భేదో నాస్తీతి, భేదా అత్యల్పా ఇతి పర

స్పరనిందా అసూయాపరవశకృతేతి, తస్మాదుభయోపిపరస్పరాను గ్రాహ్యమితిచ వేదాంతదేశికాదిభిః పాంచరాత్రరక్షాన్యాయపరిశు ద్ధాదిషూక్తం.

## పంచరాత్రసంజ్ఞా.

తత్వముక్తిప్రద భక్తిప్రద యౌగిక వైశేషిక జ్ఞానప్రతిపాద కత్వాత్పంచరాత్రమితి నారదీయే, అభిగమనాది పాంచకాలిక కర్మ ప్రతిపాదకత్వాత్పాంచరాత్రమితి శతపథబ్రాహ్మణోక్తరీత్యా (XIII 6-1)పంచరాత్ర సత్రప్రతిపాదకతయా మహానారాయణీయదీక్షాప్రతి పాదకం పంచరాత్రమితిచ, తథాఉచ్యతే, భగవదీయ పరవ్యూహ విభ వాంతర్యామ్యర్చావతారరూపప్రకార పంచకప్రతిపాదకతయా పం చరాత్రసంజ్ఞే త్యహిర్బుధ్న్యసంహితాయా ముక్తం (11 అధ్యాయే 63-64).

పాద్మసంహితాయాంతు (౧-౮౬) యోగంసాంఖ్యం బుద్ధ శాస్త్రం ఆర్హతం శైవమితి "పంచేతరాణి శాస్త్రాణి రాత్రియస్త్రేమహా న్త్యపి తత్సన్నిధౌ సమాఖ్యాసా తేనలోకే ప్రవర్తతే (౮౯) చంద్ర తారాగణం యద్వచ్ఛోభతేనైవవాసరే తథేతరాణి శోభన్తే పంచ నైవాస్యసన్నిధౌ (౭౦) పంచత్వమధవాయ ద్వద్దీప్యమానే దివా కరే బుచ్ఛంతిరాత్రియస్తద్వదితరాణి తదన్తికే (౭౧.) మీమాంసా దిషు శాస్త్రేషు యేసిద్ధార్థామనీషిణః తేషామంతేధికారోస్మిన్నితి సిద్ధాంతసంజ్ఞితం (౭౬) ఏకమూర్తిప్రధానంతు మంత్రసిద్ధాంతముచ్యతే చతుర్మూర్తిప్రధానంతు యత్తదాగమసంజ్ఞితం సిద్ధాంతముచ్యతే తద్వద్ద్వితీయం లోకవిశ్రుతం నవమూర్తిప్రధానంచ తంత్రసిద్ధాంత ముచ్యతే (౭౮) చతుర్వక్త్రే త్రివక్త్రేవా దేవే యత్రార్చనావిధిః తత్తంత్రాంతరమిష్టం స్యాత్తంత్రమేతచ్చతుర్విధం (౭౯.)" ఇతిమంత్రా గమతంత్రతంత్రాంతరభేదేన చత్వారస్సిద్ధాంతభేదా ఉక్తాః 1 తత్వ 2 మంత్ర 3 యంత్ర 4 మాయాయోగ 5 యోగ 6 మందిరనిర్మాణ 7 ప్రతిష్ఠా 8 సంస్కార 9 వర్ణాశ్రమధర్మ 10 ఉత్సవ 11 ప్రపత్త్యాది స్వరూప 12 ఔషధాదివిషయాః పాంచరాత్రతంత్రేషు సువిశద ముపపాద్యన్తే.

## కపింజలసంహితా.

కపింజలసంహితాయా మస్యాం కర్షణాదిప్రతిష్ఠాంతవిషయా స్సంగ్రహేణ సమ్య గ్విశదీక్రియన్తే, యద్యప్యపనీయవిషయావబోధార్థం గ్రంథాన్తరాపేక్షా వ్యాఖ్యానాపేక్షాచవిద్యతే.తథాపిబహుస్థలేషు శైలీసుగమా నాతికఠినాచ. అయం గ్రంథః పాంచరాత్రశాస్త్రాధ్యేతౄణాం ప్రథమశ్రేణ్యాధ్యయనయోగ్యః. అస్మిన్ సంస్కరణే పాఠభేదాదయః ప్రదర్శితా ఇతి. అయం గ్రంథ స్సర్వసమాదరణీయో భూయాదిత్యాశా.

ఇతి విజ్ఞాపయితా దాసః పరవస్తూపపదో గార్గ్యో
గోవిందాచార్యః, విజయనగర సంస్కృతకళాశాలా.



## ప్రకటనధరలు



| | | 1 పుటకు | ½ పుటకు | ¼ పుటకు |
|---|---|---|---|---|
| సం 1 కి | రు | 25—0—0 | రు 15—0—0 | రు 10—0—0 |
| ఒక్కమారుకు | | 5—0—0 | 4—0—0 | 3—0—0 |

—సంపాదకులు.

# ఆశీర్వాదము

శ్రీ శ్రీమాన్ దిట్టకవి వేంకటనరసింహాచార్యులుగారు, (తుమ్మూరు).

క॥ శ్రీ తరుణీమణిరమణుఁడు
బూతాత్మునిఁ బాంచరాత్ర♦పుణ్యాగమవి
ఖ్యాతునిఁ బొడిచే ట్యన్వయు
సీతారామానుజార్య♦ శేఖరు మనుచున్. 1

క॥
దిష్టం బగు పాంచరాత్ర♦దివ్యాగమముల్
శిష్టహితంబుగ ముద్రిణ
సృష్టిం జేయంగఁబూను ♦ శిష్టాచారా! 2

క॥ దేవరవా రంపిన శ్రీ
శ్రీవైష్ణవ పాంచరాత్ర♦సిద్ధాంతాంత
ర్భావితకపింజలాగమ
పావనతంత్రంబుఁ జూచు♦భాగ్యము గల్గెన్. 3

తే॥ గీ॥ ముద్రిణము లేక డాగి మా♦ర్మాల నుండు
పాంచరాత్రశాస్త్రగ్రంథ♦పటలమెల్ల
వెదకి సమకూర్చి పరిచరించి ♦ వెలువరించు
త్వత్ప్రయత్నంబు కొనసాగు ♦ దైవకృపను. 4

తే॥ గీ॥ అవధరింపుము దిట్టక ♦ వ్యన్వవాయ
జనిత "వేంకట నరసింహ♦సదభిధాన
కలితుఁడను విన్నపముఁజేయఁ♦గడఁగినాఁడ
పాంచరాత్రశాస్త్రోద్ధర♦ణాంచితజ్ఞ! 5

తుమ్మూరు,
26—5—31.

ఇట్లు విధేయుఁడు,
దిట్టకవి వేంకటనరసింహాచార్యులు.

# సంపాదకీయ భూమిక.

పాఠక మహాశయులారా!

"శ్రీపాంచరాత్రాగమశాస్త్రసర్వస్వ"మను మాసంస్థయొక్క పేరు వినినంతనే— "ఏమిది? ఇదియొక గొప్పశాస్త్రమా? ఇం దేమంతముఖ్యవిషయములు గలవు? ఈశాస్త్ర మెవ్వరి కుపయోగించును? ఇద్దాని నుద్ధరించుట కొకప్రత్యేకసంస్థ స్థాపించుట యావశ్యకమేనా? ఇట్టిసంస్థను సక్రమముగా నిర్వహించుటకై విశ్వప్రయత్న మొనరింపవలసియే యున్నదియా? ఎంతదూర మాలోచించినను యీవిషయ మంతటి మహత్తరమైనదిగా గన్పించుటలేదే? తెలిసియుండియు కొండను ద్రవ్వి యెలుకనుబట్ట దేశమంతయును బూనుకొని పనిచేయుట హాస్యాస్పదముగాదా?" యని పలువురు పలువిధంబుల బెద్దగా వింతజెందకపోవరు. కాని, జనసామాన్యమున నీవిషయమం దిట్టి విపరీతాభిప్రాయ మేర్పడుటకు ముఖ్యకారణము.

ఈ శాస్త్రవిషయికమగు నమూల్యగ్రంథసముదాయ మింతవర కెచ్చటగాని సమగ్రముగా బ్రకటింపఁబడుట కేమాత్ర మవకాశమును గలుగక పోవుటచేతనే యిద్దాని మహోత్కృష్టతయు, సర్వజనోపయోగ్యతయు, దేశౌన్నత్యప్రదాయకమహిమావిశేషమును యెల్లవారలకును దెల్లమగుట దటస్థింపలేదనియు, అందును, యీ శాస్త్రసంబంధములగు గ్రంథరాజములెన్నో స్వార్థపరులగు కొన్నికొన్నిప్రత్యేకసంఘములవారిచే నతిరహస్యముగాగూడ దాచిపెట్టఁబడి, యనన్యగోచరములై యిందుకు ఫలితముగా దుదకు నేటికాలవైపరీత్యముచేత ప్రతిపల్లెయందును పూరింటియటకలపై నిట్టి యుత్తమ గ్రంథములసంఖ్యాకములుగా ప్రాతవెదురుపేళ్లబుట్టలలోబడి తమపై బారిన దుబ్బదులుపుదిక్కైనను లేక, క్రిమికీటకాదుల కాహారముగా మారిపోవుచు, నిమ్మహాశాస్త్రము చూచుచుండగనే రోజురోజునకును జీర్ణించి సంపూర్ణముగా విస్మృతవాఙ్మయ మగుటకే సర్వసిద్ధమయి యున్నందుచేతను - ఇట్టి కారణములచేతనే ప్రస్తుత మీశాస్త్రమున

శ్రీ

మహాజనసంఘమున కభిరుచి తగ్గి యిట్టియభిప్రాయభేద మేర్పడుట తటస్థించినదే గాని, ఇంతటి మహోపయోగకరమైనట్టియు వేదము వలె నపౌరుషేయమై, శ్రుతి స్మృతీతిహాస పురాణాదులయం దత్యంతము కొనియాడఁబడియున్నట్టియు, మన భారతవర్షమునందలి హిందూమహాజనసంఖ్యలో సుమారు మూడవవంతుగల శ్రీవిశిష్టాద్వైత మతస్థుల కెల్ల ముఖ్యాధారమైనట్టియు, అతిచిర కాలానుగతముగా ననేక మహర్షులచేతను, ప్రముఖులగు యనేక ప్రాచీన నవీనవిద్వత్పుంగవులచేతను మహత్తరముగా విమర్శింపఁబడి యనుపమానమగు నుత్తమశాస్త్రముగా నిరూపింపఁబడి నట్టియు, యనేకవిదేశీయవిద్వత్ప్రముఖులదృష్టినిగూడ నాకర్షించి యట్టి వారలపొగడ్తలకున్ను పాత్రమైనది యునగు ఈ పాంచరాత్రాగమమువంటిమహోత్తమశాస్త్రము వేరొకటి కన్పించనే గన్పించదని ఘంటాపథముగా నొక్కి చెప్పవచ్చు, యింతటి యుత్కృష్టశాస్త్రమునం దిసుమంతయేని మన మభిమానము వహింపక యీప్రస్తుత శిధిలావస్థ నిద్దాని కంటగట్టుట మిక్కిలి యవివేక మనియు, నియ్యది మన దేశమున పూర్తిగా నశించుటయే తటస్థించునేని యంతటి యనర్థము వేరొక్కటి యుండఁబోవదనియు, కాననే ఈ యాగమశాస్త్రము నుద్ధరించి యథాశక్తి కృషిసల్పుట సర్వమానవసామాన్యధర్మనిర్వహణమాత్రమే యని భావించి, యట్టి మహత్తరోద్దేశ్యముతోనే ప్రస్తుత మీసంస్థ నీవిధముగా మేము స్థాపించి యుంటిమనియు, ఈ శాస్త్రపఠనముచే మానవజీవితరహస్యమెల్ల గరతలామలకమై లోకమున కంతటికిని మహామంగళ మాపాదింపబడుట నిశ్చయమనియు, ప్రతివ్యక్తిపరముగా గూడ నీశాస్త్ర మెంతో లాభకారియనియు, దేశాభ్యుదయసంధాయకములగు నుత్తమ మార్గములలో నింతటి ముఖ్యమగునది వేరొకటి యుండబోవదనియు, కాననే—తా మెల్లరును యీ మాయుద్యమమునం దత్యంతాభిమానమును వహించి తగు సహాయసానుభూతుల విరివిగా నొసంగి దేశభాషా భగవద్భాగవతసేవల నొనరించుటగా యీసంస్థ నుద్ధరింపక తీరదనియు మేమిప్పుడు విన్నవించుట మీకు మరియు నాశ్చర్య జనకము గాకపోవదు.

అయినను యీ మా విన్నపమందుగల సత్యమును రాను రాను తా మీ సంస్థమూలకముగానే స్వానుభవముపై గ్రహింపగలిగి తమతమ కర్తవ్యముల నిర్వర్తించి యశోవిలసితులై మిగిలిన దేశీయుల కందరకును యాదర్శకపాత్రయులై వెలయగల రనిగూడ త్రికరణశుద్ధిగా విశ్వసించియే సాహసించి, మహోదారహృదయులగు దమయభిమా నాదరణముల నాధారముగా జూచుకొనియే తమయందరిపక్షమునను మేమిపు డీకార్యరంగమున నడుగిడ నియ్యకొంటిమి.

పాంచరాత్రాగమము - దానిప్రశస్తత.

మాసంస్థయొక్క గ్రంథమూలశాఖలో నీగ్రంథమే ప్రథమప్రచురణమగుటవలన, నిందే యీ సంస్థయొక్కముఖ్యోద్దేశమును, అనగా యే పాంచరాత్రాగమము నుద్ధరించుటకై యీయుద్యమ మారంభింపబడినదో యట్టి యాగమప్రాశస్త్యమును విరళముగా మాపాఠకమహాజనుల కెల్లరకును విన్నవించుట మా ముఖ్యవిధాయకకృత్యమై యున్నది. కాని యద్దానిని సమగ్రముగా నెఱింగింప యత్నింతుమేని వేలపుటలుగల యెన్నిసంపుటములనో యిందులకై ప్రత్యేకముగా వెలువరించినగాని యిమ్మహావాఙ్మయమందలి యొకస్వల్ప విషయమును గురించియైనా సంగ్రహముగా నన్నివిషయములను వెల్లడించితి మనుట కవకాశము గలుగదు. నిజముగా నింతటి యమూల్యశాస్త్రమునుగురించి యిదమిత్థమని యేమో వ్రాయబూనుట యిద్దాని ప్రాముఖ్యతను కొంత తగ్గించుటకే హేతువగును. అందులోను నావంటి యల్పజ్ఞు డిట్టి యనిర్వాచ్యమగు విషయమును వర్ణింప దలపెట్టుటకన్నను జడత్వ మింకొకటి లేదనియే నిశ్చయముగా వచింపగలను. అయినను సంపాదకునియొక్క ముఖ్యధర్మమును మీరుట అతిసాహస మనిపించుకొనును గాన, "యవాఙ్మానసగోచరుండగు నప్పరమేశ్వరు నొక్కటి రెండక్షరముల సంపుటీకరణమగు నొక మంత్రముచే వ్యక్తపరుపదలంచినట్టుల," నాకు సాధ్యమగు నంతలో నాశక్తి ననుసరించియే యిం దీ శాస్త్రమును గురించి కొంత వ్రాయబూనుచున్నాడను. అందును శ్రీ పాంచ

రాత్రాగమ ప్రాముఖ్యతను గురించి నే నెఱింగినంతలో గూడ నొక సూచీపాత్ర మాత్రముగా నే యిందావిషయముల వివరింపుచు, పిమ్మట నాపరాత్పరుని యవ్యాజానుగ్రహవిశేషముచేతను, తమవంటి యుత్తమపురుషుల యమోఘాశీర్వాదసహాయములప్రభావముచేతను మా యా గ్రంథమాలశాఖ శాశ్వతముగా సాగుచుండు నేని మే మిందు ప్రకటించునట్టి ప్రతిగ్రంథమందును కొంతకొంతగా నీవిషయమును మా పాఠకలోకమునకు మనవిచేయుదుమని విన్నవించుచు నిక ప్రకృతి మునకు మఱలుచున్నారము.

ఈ శాస్త్రమునకు పాంచరాత్రాగమ మనుటయేగాక, ఏకాయనాఖ్యశ్రుతియనియు, సాత్త్వతవిధియనియు, మహోపనిషత్తనియు, భగవచ్ఛాస్త్రమనియు ననేకనామాంతరము లేర్పడియున్నవి. ఈ నామములన్నియు నీశాస్త్రముయొక్క ఆధిక్యమునే చెప్పక చెప్పుచున్నవి. ఇందలి మహత్తరములగు విషయముల ప్రశస్తత ననుసరించియే యీపై నుదహరించిన నామాంతరములన్నియు నిద్దాని కేర్పడుటకు ముఖ్యకారణమైనది. క్రమముగా మాపాఠకులకంతయును విన్నవించుకొనగలము.

పాంచరాత్రాగమముయొక్క పుట్టుక - ప్రవర్తనము.

మొత్తముమీద సృష్ట్యాదియందే లోకహితార్థమై, అనంతములగు వేదములందలి ముఖ్యభావము నెల్లవారలును సులభముగా గ్రహించి యాచరింప నవకాశముగల్గునట్లుల, లోకహితైకమతులగు అనంత, గరుడ, విష్వక్సేన, బ్రహ్మేంద్రులను నీయైదుగురును శ్రీవైకుంఠమున నా శ్రీమన్నారాయణమూర్తిని ప్రశ్నింప, శ్రీహరి ప్రసన్నుఁడై యైదురాత్రింబులలో వీరల సంశయంబుల నెల్లఁ దీర్చుట మూలముగా మొట్టమొదట నీశాస్త్రసాంప్రదాయములను సంగ్రహముగా బోధించెను. కాననే యిద్దానికి "పాంచరాత్ర"మను సార్థక నామ మేర్పడినది. ఇట్టి పాంచరాత్రశబ్దార్థమే యనేకసంహితలలో ననేకస్వారస్యములతో యిందలి విషయప్రాధాన్యమును నిరూపించునట్లుగా వివరింపబడినది. ఏది యెటులున్నను వివిధార్థప్రతిపాదకం

బగు నిమ్మహాశాస్త్రము మొట్టమొదట మోక్షోపాయప్రదర్శనముగా అనంత గరుడాదులకు బోధింపబడిన తదుపరి వారలు తమ శిష్యుల కీరహస్యము నుపదేశింప, నాశిష్యులు మరల వారివారి ప్రియశిష్యులకును యీ ముఖ్యసాంప్రదాయముల బోధింపుచు వచ్చినందున, తుద కీశాస్త్ర మనేకమహర్షులచే ఛందోనిబద్ధమగు ననుష్టుపు శ్లోకరూపకముగా, సార్ధకోటిసంఖ్యారూపకమై, యాయా మహర్షుల పేరిట ననేకసంహితలుగా విరచింపంబడి, ఉపదేశసౌలభ్యతచే దివ్యసిద్ధాంత (మంత్రసిద్ధాంత), ఆగమసిద్ధాంత, తంత్రసిద్ధాంత, తంత్రాంతరసిద్ధాంతంబు లను ముఖ్యభేదములతో పిమ్మట లోకమున వెల్లడి చేయబడినది. మొత్తముమీద ప్రతిసంహితయందును జ్ఞానయోగ క్రియాచర్యాపాదంబులగు నాలుగు ముఖ్యభాగములుగా వేదాంత, యోగ, ధర్మ, పాక, శిల్ప, జ్యోతిషాది యనేకయుత్తమశాస్త్ర విషయములచేతను, విష్ణ్వారాధనావిధాన, ఆలయనిర్మాణ, ఉత్సవ విశేష, ప్రతిష్ఠాకరణ, యంత్రోద్ధరణ, మంత్రపురశ్చరణ, ప్రాయశ్చిత్త, శాంతికర్మ, కామ్యక్రియలచేతను వీని కంగభూతముగా నవసరమగునట్టి తదితర భూగోళ, ఖగోళ, రత్నపరీక్షాది ప్రకృతిశాస్త్ర సంబంధవిషయములు పెక్కింటితోడను, ఈశాస్త్రము నేడు అమూల్యమై యలరారుచున్నది.

కొన్ని సంహితలలో పై నుదహరించిన విషయములన్నియు సంగ్రహముగాను, మరికొన్నింటిలో కొన్ని విరళముగను కొన్ని సంగ్రహముగను, యింకొక కొన్నింటిలో కొన్ని విషయములు మాత్రమే సంగ్రహముగానో లేక విరళముగానో వివరింపబడియును, యీవిధముగా మొత్తముమీద నన్నిగ్రంథములందును చేరి పై నుదహరించిన విషయములన్నియుం జక్కగా నీ శాస్త్రమునందుం బోధింపబడియున్నవి.

గ్రంథవిభజనము.

ఇట్టి మూలగ్రంథములు లేక సంహితలు పేరునకు మాత్ర మష్టోత్తరశతసంఖ్యాకము లని ప్రసిద్ధి నొందినను, యిప్పటివరకు జరిగిన పరిశోధనయొక్క ఫలితముగా సుమారు రెండువందల యేబది

సంహితలవరకును నీసంఖ్య బయలుపడినది. ఇంకను క్రమముగా నీ సంఖ్య యభివృద్ధి నొందుచునే యున్నది. ఇక నీతరగతి గ్రంథముల విషయ మటులుండ, నీశాస్త్రమునకు సంబంధించినవే మఱికొన్ని తరగతుల గ్రంథములుగూడ దేశమున గన్పించుచున్నవి. యామునాచార్యులు, రామానుజులు, వైదికసార్వభౌములు, నిగమాంత మహాదేశికులు, పిళ్లలోకాంజీయరు మున్నగు పూర్వవిద్వత్పుంగవులును; తాతాచార్య, రామానుజార్య, రంగభట్ట రాదిగాగల నవీనవిద్వాంసులును "డాక్టరు యఫ్. ఆటోస్క్రాడరు" మొదలగు విదేశీయమహాశయులును, నీశాస్త్రము నెంతగనో విమర్శించి ప్రత్యేకముగా తమ తమ యభిప్రాయముల బ్రకటించిన విమర్శనగ్రంథములున్ను, వరాహగురువు మున్నగు ఆగమవేత్తలైన మహాపురుషు లనేకులు చాల కాలము క్రిందటనే రచియించిన క్రియాకైరవచంద్రిక, ప్రయోగదీపిక, ప్రయోగమణిమాలిక, సాత్త్వతామృతసారచంద్రిక ఆలయనిత్యార్చనాపద్ధతి, పాద్మోక్తారాధనావిధి, విష్ణుపాద్మకపింజలోక్తప్రయోగవిధి మొదలగు ననేకప్రయోగగ్రంథములున్ను:— నృసింహాభట్టరు ఆళహసింగసూరీత్యాదులు రచించిన సంహితావ్యాఖ్యానములును— వైకుంఠదీక్షిత, వైద్యనాథదీక్షిత, వైదికసార్వభౌమాదులు రచించిన నిర్ణయగ్రంథములున్ను— ఇంకను, యీ శాస్త్రప్రాముఖ్యము నెఱింగిన మహాశయులెందరో విరచించిన దీపికలు, దర్పణములు, భాష్యములు, ప్రయోగసంగ్రహములు, యీ మొదలగు ననేక గ్రంథరాజములున్ను— పైనుదహరించిన విధముగా నే భాగమునకు జేరినవైననేమి, నేటివరకిమ్మహాశాస్త్రమునకు సంబంధించిన యన్నితరగతులందలి గ్రంథములసంఖ్యను బాగుగా నాలోచించిచూచిన, సుమారు పదునైదువందలకు తక్కువగా నుండనట్లుల గన్పించుచున్నది. ఈ గ్రంథము లన్నియుఁగూడ నేటిదనుకను యముద్రితములనియే చెప్పవచ్చును.

### ప్రకటితగ్రంథములు.

పై నుదహరించిన యన్నిరకముల గ్రంథములలోను, మనదేశమున ముద్రణాసౌకర్య మేర్పడినదాది నేటివరకు అచ్చటచ్చట అనగా

మైసూరు, బెంగుళూరు, అనంతశయనము, బరోడా, మదరాసు, బొంబై, కలకత్తా, కుంభకోణము, కంచీ, కడప, కాశీ, ఫైజాబాదు, పూనా మున్నగు పలుప్రదేశములయందు, అప్పుడప్పుడు దేవనాగరము, తెలుగు, కన్నడము, గ్రంధాక్షరము మొదలగు లిపులలో గతించిన యేబదిసంవత్సరముల లోపునను ముద్రింపబడి ప్రకటింపఁబడిన గ్రంథములసంఖ్య సుమారు యిరువదియైదింటికి లోపుగా నుండును. మిగిలినవన్నియు నేటికిని అముద్రితములుగానే యున్నవి. ఈస్వల్ప సంఖ్యాకములగు ముద్రితగ్రంథములలో గూడ, యేరెండు మూడు పుస్తకములకోతప్ప మిగిలినవానికి ప్రస్తుతము ప్రతులు దొరుకుట లేదు. ఇవి ముద్రితమైనప్పటికిన్ని సర్వజనులకును సంతృప్తికరమగు విధమున నచ్చొత్తింపబడక యున్నందున ఈ గ్రంధములుగూడ ప్రస్తుత మన్నియును పునర్ముద్రణావశ్యకతను గలిగి యేయున్నవి.

ఏది యెటులున్నను, ఇంతకాలమునుండి మనదేశముయొక్క దురదృష్టహేతువుచేతనే జనసామాన్యమునం దీశాస్త్రవిషయమున దగు నభిరుచి గలిగియుండనందున, యీపై నుదహరించిన యనేకపట్టణములయం దెందరెందరో మహాత్ము లీయోగమును సమగ్రముగా ప్రకటించుటకై చేసినకృషియంతయును వృథాప్రయాసముగ నేమారిపోయి, అప్పటికిని యనేక వ్యయప్రయాసలకు లోఁబడి కొన్నికొన్ని యుత్తమగ్రంథములను వారు ముద్రించి దేశమున కమూల్యమగు మహోపకృతి నొనరించినను గూడ దేశీయులు వారలయుద్యమతత్వము నేమాత్రమును గ్రహింపజాలక, వారికి తోడుపడకున్నందువలన నిమ్మహాపురుషులు తమ సర్వస్వముల నిందుల కర్పించియును హతాశులై తప్పని సరిగా నీయుద్యమమును విరమించవలసివచ్చెను. ఔరా! ఇది యంతయు మన దేశముయొక్క దుర్దశాప్రభావమే యనుటకన్న వేరొకటిగలదా?

ఇంత యేల? మన భారతజాతిలో సుమారు మూడవవంతు జనసంఖ్యగల విశిష్టాద్వైతుల కాధారమై—నేటికిని యనేకముఖ్య పుణ్యక్షేత్రములయం దాచరణీయమై -మన హైందవవిఖ్యాతపూర్వదేవాలయములలో ననేకము లెద్దాని నాధారముగా గొని నిర్మింపబడి

యెనో—అతిచిరకాలమునుండి నేటిదనుకను మన భారతీయశిల్పచాతుర్యము ఖండఖండాంతరములయందును దిగంతవిశ్రాంతయశోవిలసితమై యద్వితీయముగా నలరారుట కేశాస్త్రములు మూలభూతమైనవియో యట్టి యుత్తమశాస్త్రంబులలో నొక్కటియగు నీ "పాంచరాత్రాగమ" విషయమున, యుచితజ్ఞతగల్గియు నేడు మనమందరమును యీవిధముగా తూష్ణీంభావమునే వహించి, స్వార్థపరులగు అర్చకులు, శిల్పులు, జ్యోతిష్కులు, మంత్రశాస్త్రవేత్తలు, యోగాభ్యాసపరులు మున్నగు ప్రత్యేకసంఘములవారిచే నియ్యది యతిగోప్యముగా దాచిపెట్టబడి, తుద కూరును పేరునుంగూడమాసిపోవునటుల, రాజావలంబనాదులు లేని యిక్కలికాలంబున దినక్రమముగా శిథిలావస్థను జెందుచు చూచుచుండగనే విస్మృతవాఙ్మయమున చేరిపోవుచున్నను మిన్నకుండి, మన మిద్దాని నుద్ధరింప దలంపకుండుట యేమంతభావ్యముగా నున్నదియో యొక్కింత విచారించిన మనకర్తవ్యము వెంటనే మనకు గోచరింపకపోవునా ? ఇట్టివిషయంబుల దరిచి వెన్నదీసి యనుభవించుటకు సులభముగా ననేక సౌకర్యము లేర్పడియున్న నేటికాలమునందు సైతము మన మూరకుండుట పరిహాసపాత్రత యే యగునుగదా ?

విదేశీయుల కృషి.

సోదరప్రముఖులారా !

ఇట్టి యమూల్యవిషయములో మన మింతటి యశ్రద్ధ జూపుచుంటిమేగాని యమెరికాదేశీయురాలగు 'అనిబిసెంటమ్మ' తా నీశాస్త్రవిషయమం దెంతటి శ్రద్ధనో వహించి, తనచే మదరాసునందు స్థాపింపబడిన "అడయారు లైబ్రరీ"లో. నీశాస్త్రగ్రంథములను అముద్రితములగువానినే యొకనూరు సాపుటములదనుకను యనేకకష్టనష్టములకు లోబడి సంపాదించియుంచుటయేగాక, "అహిర్బుధ్న్యసంహిత"యను నొక ముఖ్యగ్రంథమును బ్రకటించుటగూడ జరిపియుండెననియు, యీ లైబ్రరీ డైరెక్టర్లలో నొక్కడును, జర్మనుదేశస్థుడును నగు "శ్రాడరు"మహాశయుడు క్రీ॥ శ॥ 1916 సంవత్సరప్రాంతమున జరిగిన యైరోపా

మహాసంగ్రామసమయమందు తా నహమ్మదాబాదు చెరసాలలో సుమారు యేడుసంవత్సరములు బంధింపబడుట తటస్థింపగా, నావ్యవధి నూరకే పోనీయక నీయాగమగ్రంథములనెల్ల నెంతగనో విమర్శించి, తనయభిప్రాయముల నొక ప్రత్యేకగ్రంథముగా "శ్రీపాంచరాత్రాగమ ఉపోద్ఘాత"మను పేరిట నాంగ్లములో (Introduction to Pancharatragama)యను మున్నూరు పుటలగ్రంథమును రచియించి ప్రకటించి యుండుట తటస్థించెననియు, శ్రీత్రివేంద్రంగవర్నమెంటువారలు "శ్రీవిష్ణుసంహిత" యను నొక ముఖ్యగ్రంథముయొక్క వ్రాతప్రతులను "లండన్" నగరమందలి యొకరాజకీయకోశాగారమునుండియే రప్పించి ముద్రింపవలసివచ్చె ననియు తమకు మనవిచేయుచు, ఇట్టిస్థితిలో మన దేశీయప్రభువరులుగాని, జమీందారులుగాని, మఠాధిపతులుగాని, దేవస్థానములబోర్డువారలుగాని, సర్కారువారుగాని, దేవాలయాధిపతులు అర్చకులు మున్నగువారలుగాని, తదితరద్రవ్యవంతులుగాని, ప్రముఖులగు దేశీయనాయకులుగాని, విద్వాంసులుగాని, విమర్శకాగ్రేసరులుగాని, ముద్రాలయాధిపతులుగాని యీ విషయమున లేశమేనియు జోక్యమును గలిగించుకొనక, యీ మార్గమువంక తమదృష్టినే సారింపకయున్నారనియు వ్రాయవలసివచ్చినందుల కెంతయో సిగ్గిలవలసివచ్చుచున్నది. ప్రస్తుతము మన దేశమున నామమాత్రావశేషములగు గ్రంథములకొరకై అమెరికా జర్మనీ మున్నగు విదేశములను కేల్సాచి భిక్షమెత్తవలసివచ్చినప్పటికయినా మనకర్తవ్యము నాలోచించకపోవుట దుస్థితిగాదా ?

### ఈశాస్త్రముయొక్క సర్వజనోపయోగత.

ముఖ్యముగా మన భారతీయశాస్త్రము లన్నిటికిని నడకలో నెట్టిభేదమున్నను తుదకు పరబ్రహ్మనిరూపణ మను యొకే గమ్యస్థానమును జేరుట వాని సాంప్రదాయమై యున్నదని యెల్లరు నెఱింగినవిషమేగదా ? మిగిలినశాస్త్రములవలె నీ పాంచరాత్రాగమమున్ను యెన్నివిధముల నడచినను తుదకా మెట్టుపైననే యెక్కుచున్నది. సాధారణముగా ప్రతిమానవుడును ప్రతిశాస్త్రసాంప్ర

దాయము ననుసరించియు పరబ్రహ్మము నంగీకరింపజాలడు. కాని యిన్ని శాస్త్రములలోను మతము పేరిట తనయుద్దేశముతో నేకీభవించు శాస్త్రప్రకారముమాత్రమే యీ బ్రహ్మస్వరూపము నంగీకరించును. అయినను యేశాస్త్రమున నేవిషయము తన కెంతవర కుపయోగకరమగునో యా శాస్త్రమునుండి యా విషయము నంతవరకు బరిగ్రహించుటలో నాతని కెట్టియభ్యంతరమును నుండబోదు. ఈ హేతువుచేతనే యన్ని శాస్త్రములును బ్రతివానికిని యాదరణీయములైయే యొప్పుచుండును. ప్రతిభారతీయుడును తన దేశమునందుగల యీ శాస్త్రముల నన్నిటిని అనుసరించియే తనజాతియొక్క యౌన్నత్యము నారసి గర్వించుచుండును. ఇట్టిసందర్భములో తర్క-వ్యాకరణాదిశాస్త్రములవలె నెంత యెక్కుడుగా నభ్యసించిన నంతటి వాద మొనర్చుటమాత్రమే ఫలితముగాక దేశాభివృద్ధికిని, జాతీయౌన్నత్యతకును మూలభూతములగు శిల్పమాదిగాగల యనేకమహత్తరవిషయములచే నిండియుండిన యీపాంచరాత్రాగమశాస్త్రము జీర్ణోద్ధరణ మొనరించుట యెవ్వని ముఖ్యకర్తవ్యము గాకుండును?

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రాది చాతుర్వర్ణములవారికిని యీ శాస్త్రము ననుసరింప నధికారముగలదనియు, భారతీయధర్మశాస్త్రగ్రంథములకెల్ల నీ యాగమమే మూలకమనియు, పంచమవేదం బన నొప్పెడి శ్రీమహాభారతగ్రంథమునందలి శాంతిపర్వములో శ్రీ భీష్మాచార్యులవా రంపశయ్యపైనుండి ధర్మరాజాదుల కంత్యసందేశముగా నుపదేశించిన భాగమందు వేదవ్యాసమహర్షి యొక్క సూక్తుల నొక్కమారు బఠియించిన నే భారతీయుని హృదయ మానందనిమగ్నము గాకుండును? ఇంతేగాక వసిష్ఠ, యాజ్ఞవల్క్య, వృద్ధహారీతాది స్మృతులయందున్ను; మాత్స్య, వారాహ, బ్రహ్మకైవర్తాది సాత్విక పురాణాదులయం దనేకప్రదేశములయందున్ను, పలువిధములుగా గొనియాడబడియున్న యీ శాస్త్రము నుద్ధరింపదలపడుట తన కర్తవ్యము గాదనుట కెంతటి నీచహృదయుడగు భారతీయుడైనను యంగీకరించునా? ఇట్టి యుత్తమశాస్త్రములను మనపూర్వీకు లెంతటి కష్టసమయములందును తమప్రాణములకన్న మిన్నగా గాపాడి యున

మిందలి మహల్లాభముచే నభివృద్ధి జెందవలయుననియేగదా మన కొసంగిరి! పురాతనశాస్త్రగ్రంధము లనిన మన పూర్వీకు లగు మహర్షులయొక్క విజ్ఞానపునిధు లేగదా! కాని, యట్టి మహోత్కృష్ట శాస్త్రగ్రంధములనెల్ల మన మీనా డొకపూచికపుల్లమాత్రముగా గూడ భావింపక యన్యదేశములపాలు గావించుటగాని, పూర్తిగా నంతరింపజేయుటయేగాని యవివేక మనిపించుకొనదా? ఇప్పటికే యీ శాస్త్రగ్రంధము లెన్నో నామమాత్రావశేషముగా మన దృక్పథమునుండి మాటుబడిపోయినవిగదా? ఇంకను యెంతకాల మీరీతి మనము మనదేశము నధోగతిపాలుసేయ నూహించుట? ఇంతటనేని మన ముఖ్యకర్తవ్యము నారసి హతశేషములగు గ్రంథములైన నెల్ల వారలకును యందుబాటులోనుండి జగమంతయు నిందలి మహల్లాభము నొందునట్టిమార్గము నవలోకింపకుండుట ధర్మమే యగునా? ఇంతవర కీ పరిస్థితుల నెల్ల దెలిసికొనగలిగిన పిమ్మటనైనా యీ యుత్తమశాస్త్రమునకు దురదృష్టవశాత్తుగా మనదేశమున నేర్పడిన యీ యధోగతికి మీామీా శరీరము లొక్కమారుగా గంపించి హృదయములు నీరైపోయి మన భావికర్తవ్య మద్భుతకాంతితో దమ యెదుట ప్రత్యక్షమై గోచరించుటలేదా?

### సంస్థయొక్క ప్రారంభము.

మహాత్ములారా!

ఇట్టి పరిస్థితుల నన్నింటిని యవలోకించియే యీ యుత్తమ శాస్త్రమును మనదేశమున బునరుద్ధరించుటకై యథాశక్తి కృషిసలుపుట యెల్లవారికిని ప్రస్తుత ముఖ్యకర్తవ్యముగాచి, నిశ్చయిం యీ స్థితిగతుల నన్నింటిని యాఘూలాగ్రముగా విన్నవించిన పిమ్మటనైన దమవంటి యుదారహృదయులగు దేశీయసోదరుల దోడ్పాటు మాకు విరివిగా దొరుకక పోవదనే సంపూర్ణవిశ్వాసముతోనే భగవత్సంకల్పానుసారముగా నేటి కీసంస్థను పావనగౌతమీతీరమందలి శ్రీరామచంద్రమూర్తి దివ్యసన్నిధానమున "శ్రీ పాంచరాత్రాగమశాస్త్ర సర్వస్వ"మనే పేరతో స్థాపించగలిగితిమి. ఆంధ్రదేశపుణ్యస్థల

రాజంబగు నిమ్మహాక్షేత్రమున నిట్టి మహత్తరోద్యమ మారంభింప బడుట యాంధ్రమహాజనుల కందరికిని యుక్తసరమగు విషయమే గదా ?

గ్రంథమాలశాఖ.

ఈ సంస్థపక్షమున గ్రంథమాలశాఖగా ప్రతిసంవత్సరము నకును పన్నెండువందలపుటలకు తక్కువగాని గ్రంథములను సర్వాంగసుందరముగాను సర్వజనోపయోగకరముగాను వెలువరింపదల చితి. తమ యనుగ్రహాప్రభావమువలన నీసంస్థయొక్క పేరుసంపూర్ణ శాస్త్రప్రకటనముచే సార్థకమగుసేని ధన్యుల మగుదుము.

గ్రంథనిలయము.

బహుద్రవ్యసాధ్యమనియు, యనేకశ్రమల కాలవాలమనియు గూడ దలంపక, యీ సంస్థయం దొక ముఖ్యశాఖగా గ్రంథ నిలయమునుగూడ స్థాపించియుంటిమి. ఈ శాస్త్రమునకు సంబంధించిన ముద్రితాముద్రితగ్రంథముల నన్నింటిని యిందొకచో జేర్చిపెట్టి ప్రస్తుత మీశాస్త్రవిషయములో విమర్శింపనెంచిన మహాశయులు గ్రంథసమార్జనమునకై పొందుచున్నట్టి దుర్భరములగు కష్టనష్టముల నెల్ల దొలగించి యట్టివారలకు సర్వసౌకర్యములను గలుగ జేయుచు, దేశాభివృద్ధికిన్ని జాతీయాన్యత్యతకును యథాశక్తి దోడుపడుటయే యిందు మాకుగల ముఖ్యోద్దేశమై యున్నది. ఇప్పటి వర కెట్టులో యభిమానవంతులగు పలువురు దేశీయప్రముఖుల తోడ్పాటుచేతను, ద్రవ్యము నొక లెక్కగాజూడక వెచ్చించుటచేతను, అనేకభాషలలో ముద్రితాముద్రితములగు గ్రంథరాజములను సుమా రొక యేబదింటిని సంపాదించి యిందు చేర్చగలిగితిమి. ఈ గ్రంథసంపాదనమునకై సుమారు మూడువత్సరంబులనుండియు మేము పొందుచున్నట్టి శ్రమలను, చేయుచున్నట్టి కృషిని యా భగవంతుడొక్కడు మాత్రమే తెలుసుకొనగలడు. ఇప్పటి కీయుద్యమమం దెంతలే దనినను సుమా రొక వేయిరూప్యములకైనను తక్కువ వ్యయపడి యుండెను. ఇంకను శ్రీ అడయారు లైబ్రరీ, మైసూరుస్టేటులైబ్రరీ,

మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ, తిరువాన్కూరు స్టేటులైబ్రరీ, కెనిమరాలైబ్రరీ, శ్రీ బరోడా మహారాజావారి స్వంత లైబ్రరీ, ఆంధ్రపరిషత్పత్రికాలైబ్రరీ మున్నగు ముఖ్యప్రదేశము లందుగల గ్రంథముల కన్నింటికిని ప్రతులు వ్రాయించుకొనుటకై గూడ విశ్వప్రయత్నముల నొనరించుచున్నారము. కొందరు దేశీయ సోదరులు విక్రయింపదలపెట్టిన గ్రంథములనుగూడ నీసంస్థపక్షమున కొనుటకును తీర్మానించుకొంటిమి. ఇట్టి పరిస్థితులలో నెంతటి ద్రవ్యమైనను బొత్తిగా సరిపోవుటయే లేదు. ఆభగవత్కృపచే నీ శాస్త్ర గ్రంథములన్నియు నెచ్చటనేని దొరకుటయే తటస్థించినచో నధమపక్ష మొక్కొక్కప్రతిని వ్రాయించి పుచ్చుకొనుట కొకయేబది రూప్యములైనను తప్పక కావలసియుండును. ఇట్లు లీ పదునైదు వందల గ్రంథములను సంపాదించుట కెంతటిమొత్త మవసరమో, పిమ్మట వాటిని ప్రకటించుట కేమికావలయునో సర్వజ్ఞమూర్తులగు మా పాఠకమహాశయులే యోచింప ప్రార్థితులు. అయినను "సంఘే శక్తిః కలౌయుగే"యను నార్యోక్తి ననుసరించి మా గ్రంథమాల గ్రంథము లెప్పటికప్పుడు ఖర్చుకుడుచుండునేని యందాదాయముగా వచ్చునట్టి ద్రవ్యమునందు ఖర్చులుపోగా మిగిలినదాని నీ గ్రంథముల వ్రాయించుటకై వినియోగించిన త్వరలోనే మే మిక్కార్యమున గృతకృత్యుల మయ్యెదము.

### ప్రత్యేకపాఠశాలా మాసపత్రికా నిర్వహణశాఖలు.

ఇంకను యీ శాస్త్రసాంప్రదాయములను సాంగోపాంగముగా విద్యార్థులకు ప్రత్యేకముగా బోధించుట కొక పాఠశాలయును, యీ శాస్త్రవిషయములను విద్వాంసులచే నామూలాగ్రముగా జర్చింపించి జనసామాన్యమునం దీశాస్త్రప్రాశస్త్యమును వెల్లడింపజేయుట కనువగు నొక మాసపత్రికయును స్థాపించుట ప్రస్తుతము మన దేశమున చాల నవసరములై యున్నవి. దేశీయమహాజనుల కీమాయుద్యమమం దిసుమంతయేని యభిమాన మేర్పడి పోషకులు, సాధారణసభ్యులు మున్నగు ననేకతరగతులందుండియును [illegible] సభ్యు లేర్పడెదరేని

త్వరలోనే యతిసులభముగా నీశాఖలనుగూడ నేర్పాటుజేయ గలమని విశ్వసించుచున్నారము. తెనాలివాస్తవ్యులగు శ్రీ ధనకు ధరం రంగాచార్యస్వాములవారున్ను యిదివరలోనే యిట్టి పాఠ శాలను పత్రికను యేర్పరుప యత్నింపుచు మా యుద్యమతత్వము నాలించి గుంటూరులోగాని బెజవాడలోగాని యీశాఖల నేర్పాటు జేసినచో తాామున్ను తగువిధముగా సహాయభూతులమైయుండేద మని శ్రీ అకళంకం రంగభాష్యమయ్యంగారి (గుంటూరు) ద్వారాగా వాగ్దత్తము నొనరించి తమ యభిమానమును వెల్లడించియుండిరి. శ్రీరామచంద్రమూర్తి తప్పక మా యాశయమునుత్వరలోనే నెరవేర్చునుగాక యని మరివారి ప్రార్థించుచున్నారము.

### మహాజనసహాయము.

ఈ మాకృషి నాలించినంతనే యత్యంతానుగ్రహముతో తమ వద్దగల ముద్రితాముద్రిత గ్రంథముల నుచితముగా నొసంగియు, తగువారల నుత్సహించి సభ్యులుగా జేర్పించియు, తమ తమ వార్తా పత్రికలలో (ఆంధ్ర, వైష్ణవ, వైఖానస, వైశ్య, అర్చకమున్నగునవి) నుచితముగా నీసంస్థవిషయములను బ్రకటించియు మాకు మిక్కిలి సహాయభూతులైయున్న మహాజనులకెల్లరకును మాహృదయపూర్వక కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నారము. ఏనాటికేనియు మా యీ యుద్యమప్రారంభము చేత దేశమున కేమాత్రమేని యుపకృతి చేకూడినయెడల నా విశేషము తప్పక వీరలకే చెందగలదని నిశ్చ యముగా మనవిచేయుచు శ్రీమన్నారాయణమూర్తి వీరలకు సర్వ సౌఖ్యముల నొసంగి సర్వదా రక్షింప వేడుచున్నారము.

### ప్రథమగ్రంథప్రచురణము – శ్రీకపింజలసంహిత.

ఎట్లైననేమి, మా యీ యుద్యమమున కెల్ల ప్రతిఫలముగా నేటికీ ప్రథమగ్రంథమగు శ్రీ కపింజలసంహితను వెలువరింపగలిగి తమ కిపు డీవిధముగా సమర్పించుకొంటిమి. ప్రప్రథమమందే యసం పూర్ణమగు గ్రంథమును బ్రకటించుట యనుచితమని, యెంతగనో వెదకి వెదకి యీ చిన్నిగ్రంథమును బ్రకటింప నుద్యమించితిమి;

అప్పటికిని రెండుమూడు మాసముల కిద్దాని నొక సంపుటముగా జేర్చియే వెలువరింపవలసివచ్చినది.

ఈ గ్రంథమునం దీశాస్త్రమునకు సంబంధించిన ముఖ్యవిషయములలో నొక్కటియగు శ్రీవిష్ణ్వాలయవిధానముమాత్రమే కొంత విరళముగా వివరింపబడియున్నది. శిల్ప, జ్యోతిష, పాక, మంత్ర, ధర్మశాస్త్రాదివిషయములును కొలదిగా గలవుగాని, యది మిక్కిలియు స్వల్పమైనందున పూర్తిగా నుదహరింపబడనే లేదనిగూడ జెప్ప నొప్పును. కాని యీగ్రంథమే యీసంస్థయొక్క ప్రథమప్రచురణ మగుట శిల్పాదివిషయములే బాగుగా వివరింపబడిన గ్రంథమునే మొదట ప్రకటించుట యుచితమనియు, నయ్యది యిమ్మహాశాస్త్ర ముయొక్క యాధిక్యమున కాదర్శప్రాయమై సర్వజనాదరణీయమగు ననియు పలువురు దలంపవచ్చును. కాని, యట్టివారలకు బ్రత్యుత్తర ముగా, ప్రస్తుతము ద్రవ్యలోపమువలన మేము పడుచున్నట్టి దుర్భర కష్టము ననుసరించి, మన యాంధ్రదేశమునం దీపాంచరాత్రాగమము ననుసరించునట్టి విష్ణ్వాలయములయం దన్నింటను సర్వసామాన్య ముగా ముఖ్యాధారములగు శ్రీ విష్ణుపాద్మకపింజలసంహితలు మూడింటిలోను, నీగ్రంథమే చిన్నదిగను ముఖ్యోపయోగకరమగు నదిగను నైయున్నందువల్ల ననేకవిధములుగా నీయాలయార్చనా విధానంబుల సక్రమముగా నిర్వర్తించుట కనేకప్రయత్నము లాచరింప బడుచున్న యీ దివసములలో, మే మీగ్రంథమునే ముందుగా ప్రచురించెద మేని, ప్రతివిష్ణ్వాలయార్చకులును నయభయములచే తప్పక నొక్కొక్క ప్రతిని కొనుటగాని లేక ఆలయముపేరిట యుత్త ముపై నొక గ్రంథమునైన తెప్పించుకొనుటగాని దటస్థపడగలదనియు అట్టివారలు సాధారణముగా పోషకులుగనో సామాన్యసభ్యులుగనో యేర్పడుటయే తటస్థించినచో నీసంస్థయొక్క పునాదులు గట్టిపడునవ కాశ మేర్పడి సక్రమాభివృద్ధినొందుచు సాధ్యమగునంత త్వరలోనే జగన్మంగళసంధానకరముగా, నీసంస్థయొక్క సంపూర్ణకార్యక్రమ మారంభింపబడగలదనియు, ప్రముఖులగువార లనేకు లభిప్రాయము నొసంగియుండుటచేతను; కొందరు అర్చకులు అధికారులు మున్నగు

వారలుగూడ నీ "కపింజలసంహిత" నే ప్రప్రథమమున నచ్చొత్తిం చుట యవసరమని గట్టిగా నొక్కి చెప్పినందునను యెక్కువమంది యభిప్రాయము ననుసరించుటయే శ్రేయస్కరమని భావించి యిపు డీ గ్రంథమును ముద్రించి ప్రకటింపగల్గితిమి.

ముద్రణాసౌకర్యములు బొత్తిగా తక్కువగానున్న యీ ప్రాంతములం దీమాత్రపు గ్రంథమును వెలువరించునప్పటికే తల ప్రాణము తోకకు వచ్చి, అప్పుడే స్వంతముద్రణాలయము లేని లోటు గన్పించుచున్నది. అయినను, దేశీయమహాజనుల తోడ్పాటు మా కిసుమంతయేని గలిగినయెడల నీ ముద్రణాలయసంపాదనముగూడ నొక గొప్పకార్యముగాదనియే తలంచుచున్నాము. కాని భగవత్కృప యెట్లున్నట్లు జరుగక తప్పదుగదా ?

ఈ గ్రంథమును ముద్రించుటలోగూడ, సాధ్యమగునంతవరకు సర్వాంగసుందరముగాను సర్వజనోపయోగకరముగాను ప్రకటించుటయే మేము ముఖ్యోద్దేశముగా గొనియున్నందున మార్చి మొదటి వారమునందే ప్రకటించవలసిన యీ గ్రంథ మొకప్రెస్సునుంచి వేరొక ప్రెస్సునకు మారవలసివచ్చి నేటి కెట్టులో విజయవాడ శ్రీ ఆంధ్రగ్రంథాలయముద్రాక్షరశాలను జేరుకొని, యీ ముద్రాలయాధిపతులగు మ॥ శ్రీ కర్లపాలెం కోదండరామయ్యగారి తోడ్పాటువలన మేము దూరస్థులమైయున్నను త్వరలోనే యీ గ్రంథముయొక్క ముద్రణకార్యము లుచితవిధమున నిర్వర్తింపబడుట తటస్థించి, శ్రీ బరోడా మహాసంస్థానమువంటి వారలే 'జయాఖ్యసంహిత' ముద్రణ మారంభించి నేటి కారుమాసములైనను యింకను మూడు నాలుగు మాసముల దనుక నద్దాని బ్రకటింపజాలని స్థితిలో నున్నప్పుడు, అన్నింటను గొరమాలి యింకను ప్రారంభదశయందేగల యీసంస్థయొక్క ప్రచురణమే ముందుగా దేశీయులహస్తముల నలంకరింప గలిగినందుల కెంతయు నానందించుచు, యిందుకు ముఖ్యకారణభూతులగు శ్రీ కోదండరామయ్యగారికిన్ని, మాసభ్యులకున్ను యీ శ్రీరామచంద్రమూర్తి సర్వదా సర్వమంగళము లొసంగి బ్రోచునుగాత యని హృదయపూర్వకముగా ప్రార్థించుచున్నారము.

కపింజలసంహిత కిది ద్వితీయముద్రణము ?

ఈగ్రంథ మిదివరలో సుమారు నలుబది సంవత్సరములకు మున్ను, చెన్నపురిలో శ్రీ యోగి శ్రీరంగపట్టణం పార్థసారథిఅయ్యం గారిచే తెలుగులిపిలో ప్రకటింపబడియుండెను. ఏకారణముచేతనో గాని యీగ్రంథము మిక్కిలి చిన్నచ్చులో, పీచుకాగితములపై విష యసూచికయేని లేకయే, లెక్కకు మిక్కిలియగు తప్పులతోడను కొన్నికొన్ని శ్లోకార్థంబులనే పూర్తిగా విడచిపెట్టబడియును ముద్రిం పబడినది. అట్టి గ్రంథమునకైనను ప్రస్తుత మెచ్చటగాని ప్రతులు చిక్కుటలేదు. ఈగ్రంథమును జూచినంతనే ప్రకాశకు లేయొక్క మాతృకనో యాధారముగాగొని యద్దాని ముద్రించినటుల గన్పించు నేకాని కొన్నిప్రతులను సంపాదించి తగు విమర్శనమొనరించియే వెలువరించినటుల దోచదు. కాన, నిట్టి పరిస్థితులలో మాసంస్థయొక్క యుద్దేశముల ననుసరించి యీగ్రంథమును ముద్రించుటకై దేశమునం దచ్చటచ్చటగల మరికొన్ని తాళపత్రప్రతులనుగూడ సంపాదించి, సాధ్యమగునంతవరకును తప్పులను దిద్దుబాటు చేయించియే పాఠాం తరములు, అధికపాఠములు, అనుబంధములు, అధ్యాయాంతర్గత విషయవివరణపట్టికలు మున్నగున వన్నియునుచేర్చి, యిప్పు డిద్దాని నెల్లరకును దృష్టికరమగు విధమున నచ్చొత్తింపించి ప్రకటించియుం టిమి. ఇంకను మున్ముం దీగ్రంథముయొక్క తాళపత్రప్రతు లేమై నను దొరకుట తటస్థించినచో పునర్ముద్రణమందు గాని లేక ప్రత్యే కానుబంధముగాగాని ముఖ్యములగు విషయము లేమైననున్నచో ప్రకటింప యత్నించెదము. ఈగ్రంథమునం దీశాస్త్ర ప్రాముఖ్యత ననుసరించిన చిత్రపటములనుగూడా కొన్నింటినిమాత్రమే జేర్చి యుంటిమి. ఇంకను విరివిగా నిట్టివి జేర్పదలచితిమి గాని యియ్యదియే మాకు ప్రథమప్రయత్నమగుటవలన నింత కన్నను సాహసింపజాలక పోతిమి. భగవత్కృపయు తమ యందరితోడ్పాటునుమాకు జక్కగా గలుగునేనిమాసంస్థయొక్క ద్వితీయగ్రంథమునే యింతకన్నను వేయి మడుంగులు మిన్నగా ప్రకటింతుమని మనవిచేయుచున్నాము.

మఱియొక్క పర్యాయము మాసంస్థ కనేకవిధములుగా తోడ్పాటు నొసంగిన మాసభ్యుల కందరకును యా పరమేశ్వరుడు సర్వదా ఆయురారోగ్యాద్యష్టైశ్వర్యముల నొసంగి రక్షించుగాకయని కోరుచు, మహోదారహృదయులగు దేశీయమహాజనుల యభిమానాదరణములచేత యీమాసంస్థ సత్వరమే సంపూర్ణాభివృద్ధినొందునని త్రికరణశుద్ధిగా విశ్వసించుచున్నారము. శ్రీమద్భద్రగిరి శ్రీసీతారామచంద్రమూర్తి మాయభీష్టమును వెంటనే సిద్ధించునట్లనుగ్రహించును గాక !

ఇట్లువిన్నవించు,

శ్రీపాంచరాత్రాగమశాస్త్ర
సర్వస్వము, భద్రాచలం.
తూర్పుగోదావరిజిల్లా.

పా. సీతారామానుజాచార్యులు,
ముఖ్యసంపాదకుడు.
గొట్టుపుళ్ళ చినశ్రీనివాసాచార్యులు,
సహాయసంపాదకుడు.



ఈ గ్రంథమును బరిశీలించి ముద్రించుటలో మాచే యుపయోగింపబడిన ముద్రితాముద్రితగ్రంథములయొక్క వివరణపట్టిక.



A.—ముద్రితప్రతి-తెలుగులిపి-పీచుకాగితములు-సన్నని అచ్చున్ను గలది. టి. సుబ్బారావు (కలెక్టరుఆఫీసు, ఇంగ్లీషు హెడ్డు క్లార్కు) గారి పీఠిక గలిగియున్నది. సంపూర్ణగ్రంథము. కాని తప్పులు మిక్కుటము గనే గలవు. (కడపనుంచి శ్రీమయూరం అప్పలాచార్యులవారు జి. యల్ శాస్త్రిగారి ద్వారాగా పంపినది) ఈ గ్రంథము కొంతపాతప్రతియై పై కాగితములు కొన్ని ఊడిపోయినందున దీని నెవ్వరు ప్రకటించిరో యెచ్చట ముద్రింపబడినదో, యెచ్చట నేవిధముగా నెప్పుడు ప్రచురింపబడినదో తెలుసుకొనుటకు తగిన యాధారములు లేవు.

B.— మాతండ్రిగారగు శ్రీమాన్ చిన్నశాయన్నాచార్యులువారు శ్రీగొట్టుపుళ్ల సీతారామానుజాచార్యులుగారివద్ద గల పూర్వప్రతి ననుసరించి క్రీ. శ. 1917 వ సంవత్సరమున వ్రాసిపెట్టినవ్రాతప్రతి-కాగితములగ్రంథము - సమగ్రము - తెలుగులిపి - అంతపరిశుద్ధమయిన ప్రతి గాదు.

C.—మాతండ్రిగారే క్రీ. శ. 1916 వ సంవత్సరమందు తాళపత్ర కోశముల ననుసరించి వ్రాసియుంచిన "శ్రీవిష్ణుపాద్మకపింజలసంహితోక్తప్రయోగవిధి". భద్రాచలమహాక్షేత్రమునందున్ను తదితర స్థలములయందనేకచోట్లను చిరకాలమునుండియు ఆచరణమందుగల ప్రయోగగ్రంథము - తెలుగులిపి - కాగితములప్రతి - సమగ్రము - చాలవరకు పరిశుద్ధప్రతి యనియే చెప్పవచ్చును.

D.— తాళపత్రగ్రంథము - తెలుగులిపి - అసమగ్రము - సుమారు 100 సంవత్సరముల క్రిందట శ్రీ అమరవాది చెన్నకృష్ణమాచార్యులుగారు వ్రాసియుంచినది. చాలవరకు పరిశుద్ధప్రతియే. పైనుదహరించిన వారి ద్వితీయపుత్రులున్ను మా మామగారున్ను యగు శ్రీ అ. పెద్దశేషాచార్యులుగారొసంగినది.

E.—తాళపత్రప్రతి - కడపప్రాంతములయందు ఆచరణమందు గల శ్రీవిష్ణుపాద్మకపింజలసంహితోక్తప్రయోగవిధి - సమగ్రగ్రంథము - శ్లోకరూపము - తెలుగులిపి - కొంతవరకు పరిశుద్ధము - కడపనుండి శ్రీ మయూరం అప్పలాచార్యులువారు శ్రీ. జి. యల్. శాస్త్రిగారిద్వారా ననుగ్రహించినది.

F.— శ్రీరామోత్సవరత్నాకరము - ముద్రితప్రతి - తెలుగు లిపి - సమగ్రము - పరిశుద్ధము - కపింజలసంహితోక్త శ్రీరామకల్యాణోత్సవప్రయోగముగల గ్రంథము - మదరాసులో ముద్రింపబడినది.

మ. రా:—ఇం దుదహరించిన ఇంగ్లీషుఅక్షరములనే పాఠాంతరములు అధికపాఠములు వ్రాయుటలోగూడా గుర్తుగా నుంచి యున్నందున పాఠకులు గ్రహింప ప్రార్థితులు.

—సంపాదకుడు.



శ్రీ

# కపింజలసంహితాయాం

## అధ్యాయానుక్రమణికా.



ఇత్యధ్యాయానుక్రమణికా

స మా ప్తా.



శ్రీ

# కపింజలసంహితాయాం

# అధ్యాయాంతర్గతవిషయవివరణపట్టికా.

## —♦ చతుర్థాధ్యాయే - సమయాచారవిధౌ ♦—



## —♦ పంచమాధ్యాయే - నక్షత్రదివసాది నిరూపణే ♦—



## —♦ షష్ఠాధ్యాయే - నిమిత్తపరీక్షాయాం ♦—



## —♦ సప్తమాధ్యాయే - వసుధాలక్షణే ♦—

## —♦ త్రయోదశాధ్యాయే - స్నపనవిధా ♦—

## —♦ చతుర్దశాధ్యాయే - సాధకస్నానవిధిః ♦—



## —♦ పంచదశాధ్యాయే - అర్చనావిధిః ♦—

## — ఏకోనవింశాధ్యాయే - ద్రవ్యశుద్ధౌ —



## — వింశాధ్యాయే - పుష్పవిధానే —

| విషయవివరణం. | పుటసంఖ్యా. | విషయవివరణం. | పుటసంఖ్యా. |
|---|---|---|---|

## —♦ ఏకవింశాధ్యాయే - అంకురార్పణవిధౌ ♦—



## —♦ ద్వావింశాధ్యాయే - ధ్వజారోహణవిధౌ ♦—

## —♦ త్రయోవింశాధ్యాయే - ఉత్సవవిధౌ ♦—



## —♦ చతుర్వింశాధ్యాయే - పుష్పయాగవిధౌ ♦—

## —♦ అష్టవింశాధ్యాయే - స్వాపవిధౌ ♦—



## —♦ ఏకోనత్రింశాధ్యాయే - పూరణవిధౌ ♦—



## —♦ త్రింశాధ్యాయే - పత్రిచ్ఛేదవిధౌ ♦—

విషయవివరణం. పుటసంఖ్యా. విషయవివరణం. పుటసంఖ్యా.

## —◆ ఏకత్రింశాధ్యాయే - ప్రాయశ్చిత్తవిధౌ ◆—



## —◆ ద్వాత్రింశాధ్యాయే - పవిత్రారోపణవిధౌ ◆—

శ్రీ కపింజలసంహితాయాం
అధ్యాయాంతర్గతవిషయవివరణపట్టికా
సమాప్తా.

---

శ్రీ కపింజలసంహితాయాం

## శ్లోక సంఖ్యా వివరణపట్టికా.

| | |
|---|---|
| త్రయస్త్రింశాధ్యాయపరిమితసంహితాయాం | 1530 |
| అనుబంధేషు | $45\frac{1}{2}$ |
| అధికపాఠశ్లోకాః | 203 |
| | $1778\frac{1}{2}$ |

N. B. :—పాఠాంతరములుగాను, ఉపోద్ఘాతాదులయందున్న గల శ్లోకము లిందు జేర్పబడలేదు. వానితో గూడ నీ సంపుటమందు సుమారు (2000) రెండు వేలశ్లోకములు గలవు.

---

ఓం

శ్రీమత్పాంచరాత్రదివ్యాగమే

# శ్రీ కపింజలసంహితా.

## ప్రథమోధ్యాయః.

తంత్రపారంగతకీర్తనం.

**

శ్రీ కపింజలాశ్రమవర్ణనం

మేరుశృంగే మహాపుణ్యే । నానారత్నోపశోభితే
సిద్ధవిద్యాధరాకీర్ణే । బహుగంధర్వశోభితే॥ 1
నానాదేవసమాకీర్ణే । గజసింహసమావృతే
యక్షకిన్నరనాగాఢ్యే । బహూదకసమావృతే॥ 2
కదళీ చూత పున్నాగ । దేవదారు సమావృతే
†భృంగషండసమాకీర్ణే । సువర్ణద్రుమమండితే॥ 3
పద్మషండసమాకీర్ణే । కాంచనస్థలశోభితే

కపింజలమహర్షి వర్ణనం.

తస్మిన్ దేశే సుఖాసీనం । ఉదయాదిత్యసన్నిభం॥ 4
కపింజలం మునిశ్రేష్ఠం । సర్వవిద్యావిశారదం
వేద వేదాంగతత్వజ్ఞ । మాత్మజ్ఞానపరాయణం॥ 5

---

A † ఈ శ్లోకార్థపాదము తాళపత్రప్రతిలో లేదు.

B ** గ్రంథారంభమందు మాయొద్దగల వ్రాతప్రతిలో నీదిగువ నుదహరించిన మంగళశ్లోకములు కానవచ్చెడిని.

శ్లో॥ లోకాభిరామ, భద్రాద్రి । ధామా, పావననామ, భో
శ్రీరామ, సద్గుణస్తోమ । నమస్తే స్తు సదా విభో॥

శ్లో॥ అయోధ్యరామ రాజేంద్ర । సీతాకాంత జగత్పతే
శ్రీరామ పుండరీకాక్ష । రామభద్ర నమోస్తు తే॥

వేదార్థవేదినం విప్రం। వాసుదేవపరాయణం

కాశ్యపాగమనం.

వినయే నోపసంగమ్య। కాశ్యపో వదతాం వరః॥ 6
ప్రణమ్య శిరసా భూమౌ। పప్రచ్ఛేదం జగద్ధితం

పాంచరాత్రాగమోపదేశార్థం కాశ్యపప్రశ్నః.

ఋగ్యజుస్సామవేదాశ్చ। న్యాయశాస్త్రాదికాః కలాః॥ 7
కపింజల మహాప్రాజ్ఞ। శ్రుతాః పూర్వం మయానఘః
నశ్రుతం పాంచరాత్రాఖ్యం। శాస్త్రంవిష్ణుముఖోద్గితం॥ 8
శ్రోతుమిచ్ఛామి విప్రేంద్ర। సాకారోపాసనం మహత్
తచ్ఛాస్త్రం విస్తరేణైవ। వక్తుమర్హసి మే నఘ॥ 9

కపింజలప్రతివచనం శాస్త్రావతరణం.

కపింజలః—
సాధుసాధు మహాప్రాజ్ఞ। కాశ్యప ద్విజసత్తమ
* { అష్టోత్తరశతం భేదం। శాస్త్రస్యాస్య స్వరూపతః॥ 10
మృకండుతనయో మహ్యా। మవదత్పూర్వకే యుగే।
శ్రుతం చైవం మయా తస్మా। త్సారముద్ధృత్య వక్ష్యతే॥ }
బుద్ధినా హ్యాద్య తే తంత్రం। సాధుసాధు శృణు ద్విజ।

తంత్రాణాం నామశ్రవణార్థం కాశ్యపప్రశ్నః.

కాశ్యపః—
కథం భిన్నాని తంత్రాణి। నామధేయాని కాని తత్॥ 12
వక్తుమర్హసి విప్రేంద్ర। యది తుష్టోసి మే ప్రభో।

కపింజలవచనం అష్టోత్తరశతతంత్రనామసంకీర్తనం

కపింజలః—
ఆచార్యా బహవో జ్ఞేయా। స్తంత్రాణాంచ పృథక్ పృథక్॥
తస్మాద్భేదా బహుప్రోక్తా। నామధేయానికథ్యతే।
ఆద్యం సనత్కుమారంచ। చతుర్మూర్తిశ్చసంహితా॥
నారదీయంచ కపిలం। వారాహం శౌనకంతథా।
పద్మపుష్కరహైరణ్యం। పారాశర్యం స్వకేసరి॥ 15
1. { కాశ్యపాగస్త్యకపిల। యాజ్ఞ్యవల్క్యత్రిసంభవం।
విష్ణుసిద్ధాంతతిలకం। జయసాత్త్వతసంహితా॥ 16
శ్రీపుష్కరమహాలక్ష్మీ। కుశలానందపావనా। }

---

B * అష్టోత్తరప్రభేదేన, మార్కండేనతు యత్పురా.
కీర్తితం తస్మిన్ మయాత్వద్య। సారముద్ధృత్యవక్ష్యతే॥ (ఇతిచపాఠాంతరః)
1. ఈమూడు శ్లోకార్థములున్ను వ్రాతప్రతిలో లేవు

గార్గ్యంబోధాయనంతంత్రం । ఆనందాఖ్యంచశంబరం॥
పంచప్రశ్నం శ్రియఃప్రశ్నం । ప్రహ్లాదం నళకూబరం।
మూల మాశనసంతంత్రం । మార్కండేయ మతఃపరం॥
మాయావైభవికం వ్యాసం । వాసిష్ఠం జైమినం తథా।
నారాయణంచ బ్రహ్మోక్తం । వైఖానస మతఃపరం॥
హిరమాంగళికంచైవ । తథావై పారమేశ్వరం।
జయోత్తరంచ శాండిల్యం । మారీచంచతతఃపరం॥ 20
పంచతత్వం మహాజ్ఞానం । వైజయంతంచ వైభవం।
విష్వక్సేనంతథాతార్క్ష్యం । పార్వతంభూమిసంహితా॥
సనకంచ సనందంచ । విశ్వామిత్రం తథాంగిరం।
ఐంద్రం దూర్వాసతంత్రంచ । కౌబేరం వారుణంతథా॥
పావకం పవనంచైవ । యామ్యంతు వసుసంహితా।
మౌద్గలం రోమశంచైవ। మైత్రేయం మాత్స్యమేవచ ॥
బ్రహ్మాండం చాపి కౌమారం । పద్మకూర్మే తథైవచ।
వామనం పూరుషం లైంగ్యం । శాతాతపమతఃపరం॥ 24
దత్తాత్రేయం తథాజ్ఞానం । భారద్వాజంచ గౌతమం।
[1] కుముదం జామదగ్న్యంచ । వాసుదేవం సుబోధకం॥
[2] మేరుగంగాచ సత్యోక్తం । గాంధర్వగణసహితా।
నారదోత్తరవిజ్ఞానం । గజేంద్ర మనుసంహితా॥ 26
పౌలస్త్యం పులహం తంత్రం।మాయాతంత్ర మతఃపరం।
విహగేంద్ర మహాతంత్రం । పురుషోత్తమ మేవచ॥ 27
ఏతాని నామధేయాని । అష్టోత్తరశతానిచ।
ఇత్యేవం కీర్తితం విప్ర।మార్కండేయేన మే పురా॥28

---

B 1 ముకుందం జామదగ్న్యంచ - వాసుదేవం సుబోధకం. (పాఠాంతరః.)

2 మత్స్యః కూర్మవరాహశ్చ, నారసింహశ్చ వామనః
రామశ్చ రామో రామశ్చ । కలికి ర్బుద్ధ మేవచ॥—ఈశ్లోకము వ్రాతప్రతిలో యెక్కువగా గలదు.

[3] అన్యతంత్రేషు సర్వేషు । సంక్షేపాద్వక్ష్యతేధునా।

పాంచరాత్రశబ్దార్థశ్రవణార్థం కాశ్యపప్రశ్నః.

కాశ్యపః :—

కర్షణాది ప్రతిష్ఠాంతం । సాకారస్యార్చనం కథం॥ 29
పంచరాత్రస్య శబ్దస్య । కశ్చార్థః ప్రతిపాదితః।
తత్సర్వం విస్తరేణైవ । వక్తు మర్హసి సువ్రత॥ 30

కపింజలవచనం. పాంచరాత్రశబ్దార్థనిర్వచనం.

కపింజలః :—

అథవక్ష్యామివిప్రేంద్ర । పంచరాత్రార్థ ముత్తమం।
పృథివ్యాదీని భూతాని । గుణాఃపంచ మహామతే॥ 31
రాత్రయోజంతవః ప్రోక్తాః । సర్వశాస్త్రేషు నిశ్చితాః
తద్భోగా ద్వినివృత్తిస్తు । పాంచరాత్ర మితి స్మృతం॥32
కర్షణాదిక్రియా స్సర్వాః । ప్రవక్ష్యామి సమాహితః।
ఆచార్యం వరయేత్పూర్వం । తతః కర్మాణికారయేత్॥

ఇతి శ్రీ పాంచరాత్రే, కపింజల సంహితాయాం తంత్రపారంగత కీర్తనం నామ ప్రథమోధ్యాయః.

---

ఓమ్

శ్రీమత్పాంచరాత్రదివ్యాగమే - శ్రీ కపింజలసంహితాయాం

# ద్వితీయోధ్యాయః.

## ఆచార్యలక్షణం.

ఆచార్యస్య గుణగణనిరూపణం.

కపింజలః :—

ఆచార్యలక్షణం వక్ష్యే । సమాసా చ్ఛృణు సువ్రత ।
బ్రాహ్మణం యోగసంసిద్ధం । నియతం బ్రహ్మవాదినం॥
ఆత్మజ్ఞానపరం శాంతం । నారాయణపరాయణం ।
జగదుత్పత్తితత్త్వజ్ఞం । స్థితిసంహారవేదినం॥ 2

---

[3] ఏషు తంత్రేషు సర్వేషు(పాఠాంతరః).

శ్రద్ధాస్తిక్యయుతం సౌమ్యం। సర్వతంత్రార్థకోవిదం।
ప్రతిష్ఠాతంత్రకుశల। మనాచారేషు నిస్పృహం॥ 3
వ్యవసాయం సుశీలజ్ఞం। కృతహస్తం విచక్షణం।
చతుర్విధస్థానవిద। మాశ్రమాచారతత్పరం॥ 4
శ్రేష్ఠవంశసముద్భూతం। శ్రౌతస్మార్తక్రియాపరం।
వేదవేదాంగతత్వజ్ఞం। శ్రౌతపావకతత్పరం॥ 5
సర్వలక్షణసంపన్నం। సర్వావయవశోభితం।
యువానంకోమలం దాంతం। ఋతుగామిం ద్విజోత్తమం॥
ఏభిరేవ గుణైర్యుక్త। మాచార్యం వరయేత్సుధీః।
ఆచార్యవరణం. [1] సన్న్యాసినం వనప్రస్థం। బ్రహ్మచారిణ మేవచ॥ 7
దీక్షితం భగవద్భక్తం। సమయాచారతత్పరం।
ఆచార్యలక్షణం ప్రోక్తం। [2] దీక్షాంచకథయేశ్శృణు॥ 8
దీక్షావిధిః, స్థల నిర్దేశః. నదీతీరేషు తీర్థేషు। గ్రామేషు నగరేషుచ।
పర్వతేషు ప్రశస్తేషు। దేవతాయతనేషుచ॥ 9
పుణ్యోద్యానేషు రమ్యేషు। గోష్ఠేశుద్ధగృహేపివా।
మంటపనిర్మాణ విధిః. మంటపంకారయేద్ధీమాన్। చతురశ్రం సువిస్తరం॥ 10
చతుర్ద్వారసమాయుక్తం। చతుస్తోరణభూషితం।
దర్భమాలాపరిక్షిప్తం। పుష్పమాలోపశోభితం॥ 11
[3] ముక్తాదామైస్సువిస్తార। మష్టదిగ్గజసంయుతం।
దర్పణోదరసంకాశం। ఋత్విగ్విప్రగణైర్వృతం॥ 12
మంగళాంకురసంయుక్తం। ద్వారకుంభోపశోభితం।
చక్రాబ్జాదిమండలరచనాప్రకారః. తస్యమధ్యేలిఖేద్విద్వాన్। మండలం లక్షణాన్వితం॥ 13
భద్రకం స్వస్తికంవాపి। చక్రాబ్జం చేతరంతువా
సూత్రపాతం తతః కృత్వా। లిఖేచ్చక్ర మనుత్తమం॥ 14

B 1 సన్న్యాసినం కాననస్థం (పాఠాంతరః).
2 దీక్షాం వక్ష్యామి తచ్ఛృణు - (పాఠాంతరం).
3 ముక్తాదామైస్సువిస్తీర్ణం (ఋత్విగ్విప్రగణైర్వృతం) ఋత్విగ్భిర్జనసంయుతం। దర్పణోదరసంకాశం మండలాభ్యంతరం మునే (ఇతి చ పాఠాంతరః).

చక్రస్య మూలమంత్రేణ । తతశ్శంఖం నిఖాతయేత్
తతశ్చ వలయాన్యష్టౌ । లిఖిత్వా దేశికోత్తమః॥ 15
కర్ణికావలయం పూర్వం । మధ్యక్షేత్రం తదేవతు
దళాంతవలయాంతం వా।నాభిక్షేత్రం తదేవతు॥ 16
త్రిభాగీకృత్య నాభిస్తు । సూత్రపాతేన మంత్రవిత్
తత్కేసరాంతవలయం । పూర్వభాగే సమాలిఖేత్॥
నాభిక్షేత్రం బహిః పశ్చా।న్నాభిరేఖాత్రయం లిఖేత్
అరక్షేత్రాంతవలయం । నాభ్యక్షక్షేత్రయో సమం॥
నేమిక్షేత్రాంతవలయ। మక్షక్షేత్రసమం భవేత్
ఏవంతు వలయాన్యష్టౌ । లిఖిత్వా మునిసత్తమ॥ 19
పీతం రక్తం తథాశుక్లం । శ్యామం కృష్ణం న్యసేచ్ఛవై
[1] పంచవర్ణైస్తు కర్తవ్యం । చిత్రవర్ణేన పూరయేత్॥
ఇత్యేవం మండలం కృత్వా । అధివాసం సమారభేత్

అగ్నికుండ నిర్మాణం.

పశ్చిమేమంటపే విద్వా । నగ్నికుండంతు కారయేత్॥
హోమద్రవ్యాణి సర్వాణి । విన్యసేత్పావకోత్తరే
[2] కృత్వాచాగ్నేస్తుసంస్కారం।వైష్ణవాగ్నించకారయేత్

శిష్యస్య అధివాసః.

తతశ్శిష్యం సమానీయ । బధ్వా నేత్రేతు వాససా
ఆత్మనో దక్షిణే పార్శ్వే । కూర్చహస్తం సమాహితం॥
కూర్చైస్స్పృశంత మాసీనం । ప్రాఙ్ముఖం ద్విజసత్తమ
ఆత్మనా వాసుదేవేన । జితం తేనతు సంస్మరేత్॥ 24
తేనమంత్రేణ జుహుయా । దాజ్యేన ద్వాదశాహుతీః
తత్రైవ చరుణా హుత్వా । జపే దష్టాక్షరం తతః॥ 25

స్వప్నార్థ శయనం.

స్వప్నమాకాంక్షయేద్ధీమాన్।సుస్వప్నే శోభనంభవేత్
దుస్స్వప్నదర్శనేవాపి । ప్రాయశ్చిత్తంతు కారయేత్॥

ద్వితీయదివసే.

ప్రభాతాయాంతుశర్వర్యాం।స్నాత్వాజప్త్వాచతర్పయేత్
స్వయంచాహతవాసస్తు । నేత్రే బద్ధ్వాచ పూర్వవత్॥

---

B 1 పంచచూర్ణైస్తు కర్తవ్యం.
2 కృత్వాతు కుండసంస్కారం,

దుస్స్వప్నే శాంతిహోమః.
హుత్వాతుపూర్వవచ్చాగ్నౌ । మాజ్యేనచతిలైస్తథా
ఘృతేనమధునాహుత్వా । తస్య దుస్స్వప్ననాశనం॥ 28[1]

నామకరణం శిష్యస్య.
తతఃపుష్పాంజలిశ్శిష్యో । బద్ధోష్ణీష ఉపోషితః
మండలేవిసృజేత్పుష్ప। మాచార్యస్య సమాజ్ఞయా॥ 29
పుష్పపాత్రిం పతద్యత్రి । తన్నామా శిష్య ఉచ్యతే
నేత్రిబంధం విసృజ్యాథ । మండలం దర్శయేద్ద్విజః 30

శిష్యేన భగవద్దర్శనం.
మండలే పూజితం పూర్వం । వాసుదేవం జగత్పతిం
తత్కాలే పూజయేచ్ఛిష్యో । దైవంత్రైలోక్యకారణం॥

ఆచార్యార్చనం ఆత్మార్పణంచ
ఆచార్యసమయంచైవ । శిక్షయే త్తంత్రిపారగః
ఆచార్యం పూజయేత్పశ్చా । [2]ద్గ్రామాశ్వనగరాదిభిః॥
ఆత్మానంచ తథాభక్త్యా । గురుపాదే సమర్పయేత్

పునశ్శాంతి హోమం-దీక్షా పరిసమాప్తిశ్చ.
శాంతిహోమం తతః కృత్వా । గవ్యాదిమధునా శతం॥
కర్ణికస్థంతథాదేవ। మాచార్య స్స్వయ మర్చయేత్।
పూజయిత్వా యథాన్యాయం । తతశ్శిష్యం విసృజ్యచ॥
ఇతి సమ్యక్సమాఖ్యాతో దీక్షావిధి రనుత్తమః॥ 34½

ఇతి శ్రీ పాంచరాత్రే కపింజల సంహితాయాం ఆచార్యలక్షణం నామ ద్వితీయోధ్యాయః.

---

ఓమ్

శ్రీమత్పాంచరాత్రిదివ్యాగమే - శ్రీ కపింజలసంహితాయాం

# తృతీయోధ్యాయః.

వైష్ణవసమయః.

(1) వైష్ణవనివాస యోగ్యదేశ నిరూపణం.
వైష్ణవాన్ సమయాన్వక్ష్యే।మార్కండేయేన భాషితాన్
శుచౌ దేశే వసే న్నిత్యం । విద్వజ్జననిషేవితే॥ 1

---

B 1 పద్మైశ్చైచరుణా జుహుయా । త్తస్య దుస్స్వప్న శాంతయే. (ఈ శ్లోకార్థము తాళపత్రిప్రితిలో యెక్కువగా గలదు).

2 రథాశ్వనగరాదిభిః.

